# రంగు రంగుల చీకట్లు

(కవితా సంపుటి)

డా. జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు.

# రంగు రంగుల చీకట్లు

(కవితా సంపుటి)

డా. జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు.

RANGU RANGULA CHEEKATLU
(Multicoloured Darkness)

Free verse in Telugu by
Dr. J. Bapu Reddy

First Edition - 1990



Price: Rs. 25-00
US $ 5/-

Cover design: Mr. Ramana

Cover printing: Vipla Computer Services
Nallakunta, Hyderabad - 500 044.

Published by:

JAYAM PUBLICATIONS
Plot No. 10, Road No. 5,
Jubilee Hills, Hyderabad - 500 034.

Printed at: Ramakrishna Press
Abids, Hyderabad - 500 001.

(Published with the financial assistance of Telugu University)

# ఇందులో ....

# అంకితం



ముప్పది అయిదేళ్ళుగా నాతో స్నేహయాత్ర సాగిస్తున్న సౌజన్య మూర్తి, సాహిత్య తపస్వి, విశ్వ విశాల యశస్వి డా. జి. వి. సుబ్రహ్మణ్యం గారు. ఆయన ప్రవృత్తి రీత్యా, వృత్తిరీత్యా ఆచార్యులు. ప్రాచీన, ఆర్వాచీన తెలుగు సాహిత్య క్షేత్రాలలో పండిన సమీచీన భావ సంపదను ఆవిష్కరించి ఆదరించే అంతర్నేత్రుడూ, అభిమాన పాత్రుడూ ఆయన. నిరంతర సత్యాన్వేషణలో శివంకర సౌందర్య దర్శనం చేస్తున్న ఆత్మజ్ఞాన విద్యా విజ్ఞాన సంపన్నుడాయన. మా పరస్పర ఆదర్శ మైత్రికి చిహ్నంగా, అభ్యుదయ భావాత్మలను స్పృశించే ఈ కావ్య సంపుటిని ఆయనకు అంకితం చేస్తున్నాను.

**జె. బాపురెడ్డి**

# ముందుగా ఒకమాట

లోకాన్ని చీకటి ఎన్ని రంగుల్లో ఎన్నిరూపాల్లో ఆవరిస్తున్నదో మనకు తెలియదు. ఒక రంగులో దాన్ని గుర్తించగానే అది మరో రంగులోకి మారిపోతుంది. చీకటిని చెడుకు సంకేతంగా వ్యంజిస్తున్నానని ఇక్కడ వేరుగా నేను చెప్పనక్కరలేదు. దుష్టశక్తులు దుష్ట శక్తులుగా మనకు ఎదురైతే వాటిని మనం ఎదిరించగలం. ఏదో విధంగా కొంతవరకు జయించగలం. కాని దుష్టత్వం శిష్టత్వ రూపంలో తన వ్యవహారాన్ని నడిపితే దుష్టశిక్షణకోసం, శిష్టరక్షణకోసం ''సంభవామి యుగే యుగే'' అన్న పరమాత్మ కూడ ఇబ్బందిలో పడిపోతాడు. శ్రీరామచంద్రునికి వాలి ఎవరో, సుగ్రీవుడెవరో తెలియనట్లే భగవంతునికి కూడా మంచిఏదో చెడుఏదో తెలుసుకోలేనంతగా చీకటి రక్కసి మారువేషాలేస్తున్న రోజులివి. రూపంచూచి రుద్రుడే మోసపోతాడు. మరి రంగుచూచి మనిషి మోసపడటంలో ఆశ్చర్యంలేదు. కటిక చీకట్లు వేస్తున్న కాంతివేషాల గురించి మనిషిని హెచ్చరించడానికి నేను చేసిన ప్రయత్నమే ఈ "రంగు రంగుల చీకట్లు'' కావ్యసంపుటి. తన రంగుల గుట్టు కనిపెడుతున్నామనే భయం కాస్త చీకటికి కలిగించడానికి ఈ కవితా దర్పణం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

నా ''మన చేతుల్లోనే ఉంది" కవితాసంపుటిని ఉత్తమ వచనకావ్య సంపుటిగా గుర్తించి నాకు ఈమధ్య బహుమతి ప్రదానం చేసినందుకు తెలుగు విశ్వవిద్యాలయం వారికి ముఖ్యంగా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి ఈ సందర్భంలో నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. 1986 తర్వాత నేను వ్రాసిన వచన కవితలలో కొన్ని రెండు సంపుటాలుగా—"పంచబాణ సంచా" "ప్రణవ ప్రణయం"—గత సంవత్సరం వెలువడ్డాయి. అవి శృంగార ప్రణ యానుభూతి శోభితాలు—మరి ఈ కవితలు సామాజిక చైతన్య భావ

కవితలన్నీ సమగ్ర జీవితానంద సత్యోన్ముఖాలే. ఈ భౌతిక ప్రపంచంలో సమతానంద సౌభాగ్య జీవితం గడపడానికి అందరికీ హక్కుంది—ఉండాలి. తదనుగుణమైన ప్రణయ ప్రణవ భావతత్వం కూడ మనిషికి అత్యావశ్యకం. ప్రణయానికీ, ప్రణవానికీ సముచిత స్థానం కల్పించలేని సామాజిక భౌతిక ప్రగతి వాదాలు కేవలం నినాదాలుగా నిలిచిపోతాయి. ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న విప్లవాత్మక సాంఘిక, రాజకీయ, ఆర్థికపరమైన మార్పులన్నీ, సుసంఘటిత సమగ్ర జీవితాదర్శ ప్రేరితాలే. స్వార్థం, మోసం, దోపిడి, సంకుచితత్వం, అజ్ఞానం వంటి దుష్టశక్తులు సమతాసత్య సముద్దీపితమైన సంపూర్ణ జీవితానందానికి భంగం కలిగిస్తాయి. మనిషిలో దాగియున్న అలాంటి మాయాశక్తులను కనిపెట్టి జయించవలసింది కూడా మానవుడే. అందుకే ఈ "రంగురంగుల చీకట్లు" జీవితక్షేత్రంలో వెలుగుచే ఛేదింపబడుతున్న చీకటి వ్యూహాలకు కళాత్మక చిత్రణం. మనిషిలోని , దానవత్వాన్ని మానవత్వముగా, మానవత్వాన్ని దైవత్వముగా మలచడానికి నా కవితాయజ్ఞం తోడ్పడుతుందని విశ్వసిస్తున్నాను.

నా సాహిత్య యాత్రలో నాకు నిరంతరం తోడ్పడుతున్న మిత్రులందరికీ, తెలుగు పాఠకలోకానికీ నేను సదా కృతజ్ఞుడను. దేశవిదేశాలలో నన్ను ఆదరిస్తున్న మిత్రకోటికి నేను ఋణపడి ఉన్నాను. నా కవితాక్షర శిల్పమే, నా సుహృద్భావదీప్తియే ఆ ఋణానికి చెల్లింపుగా నేను భావిస్తున్నాను. మున్ముందు సృజనాత్మక ప్రయోజనాత్మక సాహిత్య సృష్టికై కృషి చేయడానికి మీ అందరి ఆశీస్సులు నాకు దోహదం చేస్తాయని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని ప్రచురించిన జయం పబ్లికేషన్సువారికి ముఖ్యంగా శ్రీ జె. మారుతిగారికి నా కృతజ్ఞతాపూర్వక అభినందనలు.

ఈ గ్రంథ ప్రచురణకు కాసింత ఆర్థిక సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి నా కృతజ్ఞతలు. సర్వాంగ సుందరంగా పుస్తకాన్ని అనతికాలంలో ప్రచురించడానికి తోడ్పడిన

రామకృష్ణ ప్రెస్ వారికి ముఖ్యంగా శ్రీ జి. సత్యనారాణగారికి, విప్ల కంప్యూటర్స్ విజయసేనారెడ్డిగారికి నా ధన్యవాదాలు. ముచ్చటైన ముఖచిత్రం రచించిన శ్రీ రమణగారికి నా అభినందనలు. ఈ పుస్తకాన్ని ఆవిష్కరించడానికి సన్నాహాలు చేస్తున్న మిత్రులు శ్రీ వై. కె. నాగేశ్వరరావు, శ్రీ యమ్. కె. రాముగారలకు నా ప్రశంసపూర్వక కృతజ్ఞతలు.

నా చిరకాలమిత్రులు, విజ్ఞులు, నా సాహిత్యాత్మజ్ఞులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు ఈ కృతిని స్వీకరించినందుకు వారికి త్రికరణ శుద్ధితో కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. నా కృతులు స్వీకరించిన మహనీయులలో పద్మశ్రీ ఆచార్య నారాయణరెడ్డి, పద్మశ్రీ డా॥ బోయి భీమన్న, కళాప్రపూర్ణులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు, పూజ్యులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి, విశ్వవిఖ్యాత జన్యుశాస్త్రవేత్త డా॥ పి. మీరాఖాన్ (Holland), ప్రవాసాంధ్రుల సంస్కృతి ప్రదీప్తికి తోడ్పడుతున్న శ్రీ డి. సుబ్బిరెడ్డి (U.K.) డా॥ అల్లూరి రాజు (U.S.A.) గారలు ఉండటం నా సౌభాగ్యంగా భావిస్తున్నాను. వారందరికి ఈ సందర్భంలో కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. అంతర్జాతీయస్థాయిలో నా సాహిత్య వికాసానికి దోహదం చేస్తున్న U.K. తెలుగు అసోసియేషన్ వారికి, ఉత్తర అమెరికా తెలుగు సంఘం (TANA) వారికి, World Academy of Arts and Culture వారికి (ముఖ్యంగా Dr. Krishna Srinivas, Prof. Syed Ameeruddin, Dr. Knarig Boyadjian, Dr. Esther Gress) ఈ సందర్భంలో నేను ప్రత్యేక కృతజ్ఞతలు చెప్పవలసి ఉంది.

నా ఇతర రచనల వలనే ఈ పుస్తకాన్ని కూడా ప్రగతిశీలురు అయిన పాఠకులందరూ ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

**జె. బాపురెడ్డి**

# బాపురెడ్డిగారి కొన్ని ఇతర రచనలు

బాపురెడ్డి గేయనాటికలు

బాపురెడ్డి పద్య కావ్యాలు

అనంత సత్యాలు

శ్రీకార శిఖరం

ప్రేమారామం

నాదేశం నవ్వుతూంది

మన చేతుల్లోనే ఉంది

పంచబాణ సంచా

ప్రణవ ప్రణయం

In Quest Of Harmony

Longing For Life

Urn Of Love

# శిలాక్షరి

రాయిని గూర్చి
కవిత్వం వ్రాస్తున్నాను
ఎందుకంటే
అందులోనే అసలు సత్యాలు
దాగి ఉన్నాయని విశ్వసిస్తున్నాను
ప్రణవంలో నుంచి పుట్టిన
సృష్టి రహస్యాలను
ప్రబోధించే వేద వేదాంగాలై
నినదిస్తున్నాయి ప్రస్తరాలు
నా నిర్వేద హృదయంలో—

అవును
మనిషి పుట్టనప్పుడు
మర్కటం పుట్టనప్పుడు
ఏ జీవీ పుట్టనప్పుడు
చెట్టు చేమా పుట్టనప్పుడు
గాలి, నీరు పుట్టనప్పుడు
పుట్టింది గుట్టుగా
ఆ గట్టు మీది రాయి
అందుకే, రాయిని గూర్చి
కవిత్వం వ్రాస్తున్నాను—

ఇది పుట్టి వేయేండ్లు అయింది
అది పుట్టి లక్షేండ్లు అయింది
కొన్ని పుట్టి కోట్ల యేండ్లు అయింది

ఇది జరిగి ఇన్నాళ్ళయింది
అది జరిగి అన్నాళ్ళయింది
కొన్ని జరిగి ఎన్నాళ్ళో అయింది—

ఆ రూపం ఇట్లయింది
ఈ రూపం అట్లయింది
ఏ రూపం ఎట్లయిందో
ఏనాటిది ఏనాటికి
ఏమేమి అయిందో
ఈనాటిది ఒకనాటికి
ఏమి అయిపోతుందో
చెప్పటానికి తోడుపడే
చిత్రమైన కొలబద్ద 'కాలం'
మరి 'కాలం' ఏ కాలంలో పుట్టిందో
చెప్పమని వేడుకుంటున్నాను
ఈ సుప్త శిలలను—

శ్రీశైల శిఖరం మీద
విశాలభూతలం మీద
గంభీర సాగర గర్భంలో
రాశీ భూత కాలం వలె
రాజిల్లే పాషాణాన్ని
శిల్పంగా చెక్కి మొక్కుతున్నాను—

వెనక్కి పోతున్న చరిత్ర ఛాయల్లో
ముందుకు సాగే పరిణామ ప్రవాహంలో
నిశ్చలంగా నిర్భయంగా నిలుచున్న
సాక్షీభూత శిలలకు, స్వయంభువులకు
నీరాజనం పడుతున్నాను—

చీకట్లు

విజ్ఞాన విహాయసం
ప్రజ్ఞానంతో ప్రజ్వలిస్తూంది
పరమాత్మ తత్వ ప్రణవనాదంతో
ప్రతిధ్వనిస్తూంది—

పాషాణాలు ఎరుగని
భాషలు లేవు, భావాలు లేవు
అంతర్ముఖయోగ మార్గంలో
బహిర్ముఖ ప్రయోగ మార్గంలో
సత్యాన్వేషణ చేస్తున్న సాధకులకు
సత్ చిత్ భోషాణాలు ఈ పాషాణాలు
ఆత్మజ్ఞానానికి, పదార్థ విజ్ఞానానికి
ఆఖరు సోపానాలు
ఈ శిలాతోరణాలు
అందుకే, రాయిని గూర్చి నేను
కవిత్వం వ్రాస్తున్నాను—

శిలలను పూజించే
ఏకాంత సేవకుణ్ని నేను
ప్రస్తరాలను పలికించే భావకుణ్ని నేను
జడానికి చేతనానికి ముడివేసే
జీవనతరంగాన్ని నేను
నింగినీ నేలనూ కలిపివేసే
విహంగాన్ని నేను
రాయిని గూర్చి
కవిత్వం వ్రాస్తున్నాను

# జన్మదినం - పునర్జన్మదినం

చిత్రంగా ఉంది బాపూ
నీ జీవిత చిత్రం
సంచలన చిత్రంగా ఉంది బాపూ
నీ జీవిత చిత్రం
మారణాయుధాల మత్తులో
సత్యహింసా పర్వంలో
శాంతి విధ్వంసన గర్వంలో
విలయతమో వలయంలో
నిన్ను విస్మరించిన మానవలోకానికి
విచిత్రంగా ఉంది గాంధీః
నీ జీవిత చిత్రం—

అలనాడు
దక్షిణ ఆఫ్రికాలో
నిండిన దాస్యాంధకారారణ్యంలో
నీవు వెలిగించిన సత్యాగ్రహ దీపం
తిమిరంతో సమరం చేస్తూనే ఉంది
అక్కడి తెల్లవాని నల్లనీతి నాటకాన్ని
తెల్లబోయి చూస్తూనే ఉంది—

భువన భవనపు పంజరం నుంచి
హరేరామ చిలుకవై
హరే హరేః రామచిలకవై

చీకట్లు

రక్త సిక్త ఆకాశంలోకి
ఎగసిపోయావు నీవు
ఆవేదనా యమునా తీరంలో
మట్టి పొదల మాటున
ఆర్తనాదం ఆలపించే
అస్థికా వేణువై పోయావు నీవు
కాని
కాలపు తెరమీద మళ్ళీ నిన్ను
లీలగా దర్శిస్తూ
పులకిస్తున్నది లోకం —

గడ్డకట్టే చలి వేస్తుంటే
గుడ్డలు కప్పుకోవటం కూడా తెలియని నీవు
ఏ వానకు ఆ గొడుగు పట్టాలనే
ఇంగిత జ్ఞానం కూడా లేని నీవు
వట్టి నగ్న భిక్షువని
నాడు నవ్వుకున్న లండన్ నగరం
ధర్మరక్షకుడంటే ఇతడేనని
నేడు దండోరా వేసి చాటుతున్నది—

హింస జిఘాంస కంసుడు
హిట్లర్ కరాళ ఘీంకారాలకు
నాడు గజగజలాడిపోయిన బెర్లిన్
నేడు తన వెండి గుండె తెర మీద
నీ విశ్వమానవతా రూపాన్ని
ఆనందాశ్రుకణమై తిలకిస్తున్నది—

కాల తమాల వృక్షం మీద
నీవు విరజిమ్మిన వెలుగు వెంట
చరిత్ర, ఛాయా చిత్రమై
ధరిత్రిని నడిపిస్తున్నది
ప్రచండ మానవ సమస్యలకు
పరిష్కార మార్గం చూపిస్తున్నది—

నీ పుట్టిన రోజల్లా
మళ్ళీ నీవు పుట్టిన రోజు కావాలని
నీవు చెప్పినట్లు చెప్పడమే కాక
నీవు చేసినట్లు కూడా
అందరూ చేయాలని
మనసారా కోరుకుంటున్నది
నిన్ను కన్న భరతమాత
స్వార్థపరత్వాల వలలో చిక్కుకున్న
భూమాత.

# శంఖారావం

ఏదో విద్వేష విషకాలుష్యం
ఈ గాలినిండా ప్రసరిస్తున్నది
ఏదో విధ్వంసక దావాగ్ని
ఈ నేలనిండా ప్రవహిస్తున్నది
అందుకే
ప్రాణవాయువు పీలుస్తున్న మనిషి
ప్రమాదకర ఉన్మాదంలో పడిపోతున్నాడు
అభ్యుదయం పెంచుకుంటున్న
ఆశల ఆశయాల మొక్కలు
మంటల్లో మాడిపోతున్నాయి—

పవిత్ర భారత ధరిత్రి ఒడిలో
భయంకర చరిత్ర ప్రభవిస్తున్నది
నవగ్రహాలకు నక్షత్రాలకు
నాయకత్వం వహిస్తున్నది శని గ్రహం
భుజబలాన్ని బుద్ధిబలాన్ని స్వాధీనం చేసుకుంటున్నది
చదువుకున్న స్వార్థపరత్వం—

అదుగో!
విజ్ఞాన వేదికమీద వింతమనిషి వెర్రివేషం
వేదోపనిషత్ క్షేత్రంలో
ఆవులిస్తున్న అజ్ఞానభాష
మాటలకూ చేతలకూ మధ్య

సంబంధం కుదరనీయని
మాయల ఆలోచనలు
మతాలకూ హితాలకూ
విచ్ఛిన్న విద్య నేర్పే
ప్రచ్ఛన్న పరపీడనాచార్యులు
నేతృత్వం వహిస్తున్న
కురుక్షేత్రం నేటిభారతం—

ప్రకృతి శక్తులు, సహజ సంపదలు
ప్రబోధించే
ప్రేమతత్వాన్ని పాటించని పాశవికులు
గిరులకూ ఝురులకూ గాలికీ నేలకూ
నేర్పిస్తున్నారు కార్పణ్యం
వెలుగును వెడలగొడుతున్నారు
చీకటికి జై కొడుతున్నారు—

అంతరిక్ష విజయాలు
అనంత వేదాంతాలు
చరిత్ర కురిసే అనుభవాలు
ఆత్మ విరిసే అనుభూతులు
సుందర సుగతి దీపాలై
ప్రగతి పథం చూపిస్తున్నా
సామాజిక జీవితయాత్రలో
సత్యాన్ని బలిచేస్తున్నారు జడ భరతులు,
ప్రాణంలేని మట్టికోసం
మానవత్వాన్ని వెలివేస్తున్నారు అయోమయులు—

చీకట్లు

శాంతి గీతాలు ఆలపించే
హిందూ మహాసాగరాన్ని
కల్లోల పరుస్తున్న
దురాశ-నిరాశల మధ్య,
స్వార్థం-అపార్థం మధ్య
నలిగిపోతున్నవి
సమతా న్యాయం, శాంతి ధ్యేయం—

మనిషిని మించిన దైవం లేదని,
మహిని మించిన స్వర్గం లేదని
బహిర్ముఖ పదార్థ జ్ఞానం
అంతర్ముఖ ఆత్మజ్ఞానం
ఏకమై నిరూపిస్తున్న ఏకైక సత్యాన్ని
ధిక్కరిస్తున్న దివాంధాలను
నిద్రలేపే శంఖారావం ఏది ?
వక్రబాష్యాల క్రకచాల నక్రాలను
తెగటార్చే చక్రమేది ?

# కాలవేదికి కవితోపాయనం

అంటరానితనం అనే
అమానుష రాక్షసత్వం
కులతత్వం అనే
క్రూర కుటిల మూర్ఖత్వం
భారత జాతిని పట్టి పీడిస్తుంటే
ధైర్యంలేని ధర్మరాజులు సహిస్తుంటే
సాటిలేని విజ్ఞాన ప్రజ్ఞాన చక్రంతో
వాటిని ఎదిరించిన
ఏకైక విప్లవ రథసారధి అంబేద్కర్ —

మాటలు నేర్చిన మలినత్వాన్ని
మాయలు నేర్చిన మతతత్వాన్ని
నిత్య సత్య శౌద్ధంతో
నిర్మలధర్మ బౌద్ధంతో
ప్రక్షాళనం చేయబూనిన
అపూర్వ జాహ్నవి
అంబేద్కర్ —

ఆత్మజ్ఞాన ప్రసూనాలు
సమతానంద నాదాలు
పరిమళించిన
వేదోపనిషత్ వృక్షంమీద
సుందర హైందవ సమాజంమీద
విరుచుకపడ్డ గబ్బిలాలను

చీకట్లు

గూళ్ళు కట్టుకున్న గుడ్లగూబలను
చైతన్యకాంతి శరాలతో
చెదరగొట్టిన భీమధనుస్సు
అంబేద్కర్ మహోషస్సు—

దురాచార శిశిరఘాత
దుర్బల జనవనంలో
నవజీవన వాసంతంగా
చివురించిన ఋతంభరుడు
అంబేద్కరుడు—

అహంబ్రహ్మాస్మి, త్వమేవాహం అన్న
అద్వైతపు నొసటిమీద
అసమానత్వపు రేఖలు గీసి
అయోమయత్వపు రంగులు పూసి
వికృత తాండవం చేసిన
వెఱ్రి మొఱ్రి విస్సన్నలకు
మానవత్వం బోధించిన
ఆ మహర్షి పుట్టినరోజు
నా మాతృభూమి పులకించింది
నా నోట కవిత పలికించింది—

ఒప్పుకున్నట్లే ఒప్పుకొని
తప్పుకొనే తంత్రం మనది
"మార్పు" రాకుండా మార్పులు చేసే
మాయామయ మనస్తత్వం మనది

అందుకే
అంబేద్కర్ పుట్టిన రోజు
అస్పృష్టతకు తావులేనిది
అభ్యుదయ శాసనం చేస్తున్నాను
చట్టాలన్నిటికీ అర్థం కల్పించే
చట్టం చేస్తున్నాను
కులనిర్మూలన చట్టం చేస్తున్నాను—

"కులం" అంటే
మనకు మనం పులుముకొన్న మలినం అని
నిర్వచిస్తున్నాను—

"కులనిర్మూలనం" అంటే
మనిషిని మనిషిగా మార్చటం అని
ప్రవచిస్తున్నాను—

విధిగా, మానవ విధిగా
స్త్రీ పురుషులు
కులాంతర వివాహాలు చేసుకొని
సమతా ధర్మంతో
స్వకుల విషవృక్షాన్ని
సమూలంగా పెరికివేయమంటున్నాను
చట్టపరమైన కులనిర్మూలనాన్ని
సంపూర్ణంగా సమర్థించుమంటున్నాను—

చీకట్లు

కాలవేది అంబేద్కర్ కన్న
కలలన్నీ నిజం అవుతాయి
పవిత్ర భారత చరిత్రలో
పడగలెత్తిన
ప్రళయాంతక కుల సర్పాలు
కూలిపోతాయి—

హక్కులన్నిటికంటే మిన్న అయిన
మానవ హక్కులను కలిపించే ఈ
బాపురెడ్డి కవితాశాసనాన్ని
బాబాసాహెబ్ కు
బహూకరిస్తున్నాను.

# క్రిస్ మస్

పసులపాకలో పుట్టిన
శిశువు నీవు
ప్రపంచాన్ని జయించావు
స్వప్నాల కడుపులో పుట్టిన
దీపకళిక నీవు
సత్యాల సూర్యుడివై నిలిచావు—

అన్యాయాల అక్రమాల ఎడారిలో
అమృతవాహినివై ప్రవహించావు
అజ్ఞానాల అసహనాల చలిలో
ఆత్మజ్ఞానమై
ప్రేమజ్వాలవై ప్రజ్వలించావు
"బెత్లహేము" మట్టిలో
ప్రేమవాణివై రవళించావు
అంధకార జీవితాకాశంలో
ఆశాతారవై ప్రభవించావు

ప్రాచీన వేదోపనిషత్
ప్రజ్ఞాన వసంతాన్ని
స్వార్థపర శిశిర ఘాతాలు
సంకుచిత సమర గీతాలు పీడించాయి —

పరిణామ వేదికమీద
ప్రబుద్ధాత్మ చేసిన ప్రబోధాలను
పాశవికత పరిహసించింది
నిర్మల సమతా ధర్మాన్ని
నిరంకుశత్వం పరిహరించింది
నిర్బల నిస్సహాయ మానవాళి
నింగివైపు చేతులెత్తింది—

తత్వాల సారమంతా
మానవత్వంగా రంగరించి తెచ్చిన
మహోన్నతమూర్తివి, నిన్ను
"మెస్సయా" అన్నారు
అలవోకగా సీవిచ్చిన ప్రేమసందేశాన్ని
ఆబాల గోపాలం విన్నారు —

దైవత్వం దానవత్వం
మనిషిలో దాగిఉన్న వెలుగు చీకటులు—
చీకటి వెలుతురుతో
చెలగాటం ఆడుతూనే ఉంది
దానవత్వం దైవత్వం మీద
దాడి చేస్తూనే ఉంది

అందుకే
రామునివలె కృష్ణునివలె
బుద్ధునివలె జైనునివలె
మాయా రాక్షసత్వం నుంచి

మనిషిని రక్షించడానికి నీవు
మార్గం అన్వేషించావు
కామరూపియైన సైతానును
కనిపెట్టి జయించావు—

ఇరువై శతాబ్దాలుగా
ఏసువై దివివాసివై
నీవు పాలిస్తున్న ఈ లోకం
ఇంకా పాప పంకిలంగానే ఉంది
కళ్ళుండీ చూడలేని వాళ్లు
చెవులుండీ వినలేని వాళ్లు
సకలాంగాలు ఉన్నా
వికలాంగులైపోయిన వాళ్లు
సత్యాన్ని సిలువవేస్తున్న
నిత్య విద్వేష కిరాతకులు
నరలోకాన్ని నరకలోకం చేస్తూనే ఉన్నారు—

పరిశుద్ధాత్మ పరిమళించే
నీ ప్రేమ భావ వృక్షం క్రింద
క్రిస్మస్ పేరుతో
మనిషి రూపంలో ఉన్న దైవానికి
నీవు పుట్టినరోజు పండుగ చేస్తున్నాను
ఈ లోకాన్ని నాకంచేసే నీ సందేశాన్ని
సకలజన సంహితంగా సమర్పిస్తున్నాను

# మధుమాసం గర్జిస్తోంది

మార్పు జండా పట్టుకొని
మధుమాసం గర్జిస్తోంది
శైశిర పాశవ శక్తుల మీద
చైతన్య చైత్రరథం
జైత్రయాత్ర సాగిస్తోంది—

కుతంత్రాల కొండలమీద
కుమిలిపోతున్న కాశ్మీరమా!
కష్టాల కడలి ఒడిలో
కలవరిస్తున్న కన్యాకుమారీ!
అనుమానాల అడవుల్లో
అసహాయతల లోయల్లో
అలమటించే భారతీ!
ఈ ఉష్ణరక్త వాసంతంలో
నవయుగ గీతి ఆలపించు!
విప్లవజ్యోతి వెలిగించు!

అదుగో!
ప్రజాశక్తి పల్లవిగా
ప్రగతిగేయాలు పాడుతున్నాయి
పరభృతాలు;
కాలకాళికా నయనాలలో
ఆశాపలాశ దీపాలు వెలిగించి
రాలిపోతున్నాయి
నేలతల్లి ఒడిలో
త్యాగం పండిన పత్రాలు—

కులతత్వపు కోరలతో
మతోన్మాద మారణాస్త్రాలతో
మనిషి రక్తాన్ని పీల్చే
రక్తాశనులు, రక్తాక్షులు
తల వంచుక వెళిపోవాలని
ఘోషిస్తున్నాయి
బాధాతప్త క్రోధోద్రిక్త పక్షి బృందాలు
విజ్ఞాన ప్రజ్ఞానోద్దీప్త మాకందాలు
మలుపు తిరుగుతున్న భారత చరిత్రకు
ప్రాణం పోస్తున్న భావగంధాలు——

నల్లధనపు నాగుబాముల
నాటకం కట్టించే నాయకత్వంపై
మల్లెలు కురిపించే నవవర్షం ఇది
దేశ ద్రోహ దివాంధాలను
పసికట్టి నుసి చేస్తున్న
ప్రచండ కాంతివర్షం ఇది
అవకాశ వాదమే వినోదంగా
అటూ ఇటూ దూకే
గోడమీది పిల్లులకు
సంకటమైన కంటక వసంతం ఇది-

ఆస్తిపాస్తు లున్నవాళ్ళు ఆస్తికులై పోతుంటే
అవేవీ లేనివాళ్ళు నాస్తికులై వాపోతుంటే
"తత్త్వమసి, త్వమే వాహం"
తత్త్వాలు బోధపడక
తల్లడిల్లే వెర్రి మనిషీ!

## చీకట్లు

ఎక్కడున్నావు నీవు!
సంకుచితత్త్వాల స్వార్థపరత్వాల
దోపిడిలో—
దానవత్వాల దాస్యతత్త్వాల
రాపిడిలో
నీకు దాపురించిన
నిరీహ నిర్బల రూపాన్ని వదుల్చుకో
నిర్వేల కుచేల తాపాన్ని విదుల్చుకో
వాడిపోని అందాల, వీడిపోని ఆనందాల
వలువలూ విలువలూ ధరించి
క్రొత్త ఉగాది పండుగ చేసుకో!
చేదు సత్యాలు సేకరించు
తీపి తీపి మాయల్ని అందులో కరిగించు
ఉపనిషత్సారంలో వాటిని మేళవించి
ఉగాది పచ్చడి చేసుకొని
ఉజ్జ్వలంగా సేవించు
మనిషినే మా ధవుణ్ణి చేసే
మార్పు మంత్రం పఠించు—

మనిషీ!
కదం త్రొక్కి కదలిరా
జీవ జవసత్త్వాలకు జయజయనాదమై రా
అభయ భావి నభంలో
శుభోదయమై రా
నిజంగా నీవు పరమాత్ముడవే
నీ శక్తి నీవు గ్రహిస్తే
రోదనం మాని దుష్టత్వంపై
క్రోధనం వహిస్తే.

# ఆకలి లేని కోకిల

భూమిమీద పుట్టిన
బుద్ధిమంతుణ్ని నేను
మట్టిని ప్రేమించే మానవుణ్ని నేను
పుడమిటిల్లు చక్కదిద్దుకునే
పురుషార్థం నాది
అందుకే
పరలోకమనే పొరుగింటి
పుల్లకూర రుచుల కోసం
పరుగులెత్తడం మానేస్తున్నాను
ఈ లోకపు సౌందర్యం
ఏ లోకానికి లేదని
మనిషికున్న మహత్తర శక్తులు
మరెవ్వరికీ లేవని
చైత్రోదయ పంచాంగం
చెప్పేస్తున్నాను
భయాల చీకటి గదిలో
భద్రంగా దాచిపెట్టిన
బూచీల మూటల ముడులు
విప్పేస్తున్నాను—

చిగురిస్తున్న చైతన్యాన్ని
చేలాలుగా కట్టుకొని
పుష్పిస్తున్న సత్యాల
పూల జండా పట్టుకొని

## చీకట్లు

ఆకలిమీద దండెత్తిన
కోకిలాన్ని నేను
చీకటి కడవలో వెలుతురు పోసి
చేదు తీపుల్ని చేరదీసి
బ్రతుకు బాధల నివారించే
ఔషధం తయారుచేసి
ఆబాల గోపాలానికి అందిస్తున్నాను
ప్రభవిస్తున్న విజ్ఞాన ఆకాశంలో
ప్రజ్ఞాన విభవం
పంచిపెడుతున్నాను.

# స్వాతంత్ర్య స్వాంతనం

నడిరేయి మేలుకొన్న
స్వాతంత్ర్యలక్ష్మి
తన ప్రజాస్వామ్య గణతంత్ర రూపాన్ని
భరతజాతి జీవన దర్పణంలో
పదేపదే చూచుకొంటున్నది
అద్దం బాగులేదనో
తాను అందంగా లేననో
అసంతృప్తి చెందుతూనే ఉన్నది—

నలభైయేళ్ళుగా
తాను సాగిస్తున్న
ప్రగతిసౌధ నిర్మాణం
ఇటుక లేక, ఇనుము లేక
సిమెంటు లేక, కరెంటు లేక
ధనంలేక, దీక్షలేక
కుంటుబడి పోతున్నదని
సమతా స్వాతంత్ర్యలక్ష్మి
కంటతడి పెడుతున్నది;
శక్తిపరులు యుక్తిపరులు
త్రికరణ శుద్ధిలేని
స్వార్థపరులై పోతున్నారని
స్వాంతంలో కుమిలిపోతున్నది—

**చీకట్లు**

అధికారం అహంకారమై
దోపిడి వ్యాపారమై
చట్టాలు అవినీతికి పట్టాలై
దేశాన్ని మోసం చేస్తున్నాయని
దీనంగా విలపిస్తున్నది
కలలు కన్నీరైన నా కళ్ళకు
కవితా వస్తువుగా భాసిస్తున్నది.

# తెలుగు తిరునాళ్ళు

తెలుగువారి చరిత్ర
తిరునాళ్ళు జరుపుకుంది
ఉప్పొంగిన తెలుగుతల్లి
హుసేనుసాగర
హృదయ తరంగాల మీద
గతాగతాలను కలిపే
వర్తమానం వంటి
జంటనగరాలను కలిపే
ట్యాంకుబండు మీద
తెలుగువారి చరిత్ర
తిరునాళ్లు జరుపుకుంది—

ముక్కలు ముక్కలై పోయిన
తెలుగునేలను
తిరిగి ఒక్కటిగా కూర్చిన
ఒకటవ నవంబరును
ఉద్వేగంతో తలచుకుంటూ
తెలుగువారి చరిత్ర
తిరునాళ్లు జరుపుకుంది—

తెలుగువారి
చైతన్య చైత్రరథం
ఆత్మవిశ్వాస అశ్వాలతో
తేజరిల్లింది
ఎక్కడున్నా తెలుగువాడు
వెలుగువాడని

## చీకట్లు

ఆశాకిరణ పుష్పాలు
దేశం నిండా వెదజల్లింది
పల్లె నుండి ఢిల్లీదాక
మమతల
మల్లె పూదండలల్లింది
తెలుగువారి చరిత్ర
తిరునాళ్ల జరుపుకుంది

వెర్రి మొర్రి ఆవేశంతో
స్వార్థసంకుచిత విద్వేషంతో
దేశం మీద పడిపోతున్న
కాలానికి
మానవత్వపు చెరువు గట్టు మీది
మౌనవైతాళిక విగ్రహాలు
నిగ్రహం బోధిస్తుంటే
క్రాంతిమార్గం చూపిస్తుంటే
తెలుగువారి చరిత్ర తిరునాళ్ల జరుపుకుంది—

దేశభక్తి పాటలు పాడుతూ
దివ్యశక్తి ఆటలు ఆడుతూ
జానపదం జ్ఞానపదం
విశాల భారత విజయపథం కావాలని
విప్లవ వేదం వినిపించింది
తెలుగువారి చరిత్ర తిరునాళ్ల జరుపుకుంది.

# బోధపడని బాధ

చీకట్లను చీల్చుకొని చివురించిన
స్వేచ్ఛా స్వాతంత్ర్యాల తోటలో
రామచిలుకల్లా రంగులు పులుముకొని
రాబందులు చేరిపోతున్నాయి
శక్తిలేక చేజిక్కిన పులుగుల్ని
చిత్రహింస పెడుతున్నాయి—
ఎదిరించి పోటీపడలేక
తలవంచి రాజీపడలేక
ప్రగతి కాముక పక్షులు
అలసిపోయి వలస పోతున్నాయి
ఆశల కానల్లోకి
క్రొత్త ఆశయాల కోనల్లోకి—

ఎలుకలు దూరుతున్నాయని
ఇళ్ళను తగలేస్తున్న జడభరతులు
ఈగలు మూగుతున్నాయని
ముక్కుల్ని ముక్కలు చేసుకుంటున్న త్యాగనిరతులు
స్వర్ణాక్షరాలతో వ్రాయవలసిన
స్వతంత్ర భారత చరిత్రను
రక్తాక్షరాలతో వ్రాస్తున్నారు
పుష్పాలతో పూజింపవలసిన ధరిత్రిని
దుఃఖ బాష్పాలలో ముంచేస్తున్నారు

అందుకే, ఆలోచనలేని ఆవేశం
నేటి నా భారత దేశం.
విచక్షణలేని విద్వేషం
నేడు వినిపిస్తున్న విప్లవ సందేశం—

చదవేస్తే ఉన్నమతిపోయిందన్న
సామెతకు సాక్షంగా
చదువుకున్న స్వార్థపరత్వాలు,
మత్తెక్కిన విద్యా విజ్ఞానాలు
మానవత్వానికి మంటలు పెడుతున్నాయి—
ప్రాథమిక హక్కుల వృక్షాల మీద
పల్లవిస్తున్న అవకాశాల ఆకుల్ని
ఆకలి మేకలు మేసేస్తున్నాయి
పెట్టుబడి పెట్టుకోవలసిన దాన్ని
పొట్టకూడుగా వాడుకుంటున్నాయి.

కారుచీకటి నేలదున్ని
కాంతిని పండించవలసిన కోడెగిత్తలు
డోలు డప్పుల ఢమఢమలకు తలలొగ్గి
డూడూబసవన్నలై
జాలికోసం జోలెలు పడుతున్నాయి
ఆ అమాయిక శ్రమైక జీవుల్ని ఆహరించి
అవినీతి అహంకార క్రూరత్వాలు
భుక్తాయాసంతో భక్తి భజనలు చేస్తున్నాయి
భయాందోళనం చెందుతున్న భావిభారత పౌరులు
తాడు బిగిసిన గొంతుకలతో
త్యాగశంఖాలు పూరిస్తున్నారు

సంకట కంకణబద్ధ కరాలతో
సంగ్రామ భేరీలు మ్రోగిస్తున్నారు—
"సర్వేజనా సుఖినోభవంతు" అనే
సమతా మమతా మందిరంలో
పరాన్నభుక్కు భూతాలు
పేరాశా విషప్రేతాలు
ప్రళయతాండవం చేస్తుంటే
శిక్షించవలసిన ప్రజాస్వామ్య పర్వతేశ్వరుడు
శిలయై చూస్తుంటే
స్వాతంత్ర్య శ్రీనివాసుడు
సందేహంలో పడిపోతుంటే
"అహంబ్రహ్మాస్మి" అనుకున్న
ఆస్తికతా భక్తజనం
ఆత్మవిశ్వాసం కోల్పోయి
నాస్తికతా శక్తిని ఆశ్రయిస్తున్నారు
అజ్ఞాన విరక్త జీవన వీధుల్లో
అశ్రుధారలై ప్రవహిస్తున్నారు —

రామాయణం చూచి చూచి
రాక్షసులైపోతున్న వాళ్ళను
హరిశ్చంద్ర నాటకం చూచి
అబద్ధాలు నేర్చుకుంటున్న వాళ్ళను
మార్చడానికి ఏ అవతారం ఎత్తాలో
బోధపడక బాధపడుతున్నాడు భగవంతుడు
వికసిత రాజీవనేత్రుడు
సర్వసమతా ధర్మగాత్రుడు.

# భూమిని ప్రేమిస్తున్నాను

అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను
నే పుట్టిన పుడమిటింటి
కట్టడుల కడపదాటి
హద్దులులేని అడ్డులులేని
ఆకాశంలో విహరిస్తున్నాను
కోహం! కోహం! అంటూ
కోకిలమునై పాడుకొంటూ
విజ్ఞాన విభవ వసంతాన్ని
ప్రజ్ఞాన శిఖరాల మీదికి
పట్టుకుపోతున్నాను—

మనుషుల కోసం పుట్టిన
మట్టిగోళం మీదనే
పదే పదే జన్మిస్తున్న
పరమాత్ముని విలాసం కోసం
అంతరిక్ష వీధుల్లో
అక్షరాలా వెదుకుతున్నాను;
సోహంలో ఉన్న అతడెవరో
అహంలా ఉన్న నేనెవరో
తెలిసికోవాలని
చైతన్య చైత్ర శకటంలో
జైత్రయాత్ర సాగిస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను—

మట్టిగోళం వట్టిదే అయితే
మనిషి బ్రతుకు మాయే అయితే
మహినీ మనిషినీ రక్షించడానికి
మిధ్యా రాక్షసుల్ని శిక్షించడానికి
అన్నిసార్లు ఆ భగవంతుడు
అవతారాలెందుకెత్తాడో
అవగాహన చేసుకుంటున్నాను
అసలు కిటుకు తెలుసుకుంటున్నాను
అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను—

మతాలనూ హితాలనూ
ప్రబోధించే మహాత్ములను
పాపాలకు దోపిడీలకు
పాలుపడే దురాత్ములను
ప్రక్క ప్రక్కనే సృష్టిస్తున్న
పరమాత్మ తత్వం కనుక్కుంటున్నాను
అర్థం తెలియని జీవితపు
పరమార్థం కనుక్కుంటున్నాను—

ఇహలోకంలో పుట్టడం
పరలోక ప్రాప్తికోసమే అయితే
ఇహపరాల మధ్య దూరం
ఎంతుందో కనుక్కుంటున్నాను
సరాసరి అక్కడే పుట్టే
సదవకాశం వెదుక్కుంటున్నాను

## చీకట్లు

అది మాయో, ఇది మాయో
ఏది మాయో, ఏది నిజమో
ఎరిగే మార్గం చూస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలు
ఉగాదినాడు శోధిస్తున్నాను—

ఈ భూమికి ఉన్న లోపం
ఏమిటో అడుగుతున్నాను
సురలోకంలో ఉన్న సౌఖ్యాలు
నరలోకంలో ఎందుకు సాధ్యంకాదో
సమాచారం సేకరిస్తున్నాను
అక్కడా ఇక్కడా అధికారంచేసే
ఆదిదేవుడు ఒక్కడే అయినప్పుడు
పక్షపాతం ఎందుకో అని
పరిశీలన చేస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను—

వేడి వేడి ఆలోచనల, అనుభూతుల
గాలిలో స్నానమాడి
చివురిస్తున్న ఆమని చెలిమి చేలాలు కట్టుకొని
సమదర్శనం పరిమళించే శక్తి పూలజండా పట్టుకొని
శ్రీకార శంఖం పూరిస్తున్నాను
సూర్య చంద్రుల కిరణాటక సంగీతంలో
సుందరానంద నృత్యం చేస్తున్న
నా ప్రబుద్ధాత్మకు ప్రాణంపోసే
భూమిని ప్రేమిస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలు
ఉగాదినాడు శోధిస్తున్నాను.

# సంక్రాంతి సమరం

చలి పెడుతూంది
"సంక్రాంతి" సమరపర్వ
సంరంభం చూస్తుంటే
చలి పుడుతూంది—

కురుక్షేత్రంలో అర్జునిడిలా
సమాజ క్షేత్రంలో నేను
సందేహాల విత్తనాలు
చల్లుతున్నానే కాని
సమాధానాల సస్యాలు పండటం లేదు—

అధర్మాలను, అన్యాయాలను
ఎదుర్కోవటానికే
ఈ సంక్షుభిత సమాజ క్షేత్రంలో నిలిచాను,
ధర్మయుద్ధం చేయాలనే
ధైర్య స్యందనం ఎక్కి వచ్చాను
సామాన్యుని రక్షణ కోసమే
సదాశయ గాండీవం ధరించాను
అయితే,
అన్నీ తెలుసుకున్న నన్ను
అజ్ఞానం ఆవరిస్తూనే ఉన్నది
నా అపార అనుభవ ధనుస్సునుండి
ప్రజ్ఞా శర పరంపరలకు బదులు
ప్రశ్నల తుంపరలు కురుస్తున్నవి

చీకట్లు

ఎందుకో ఏదో భయం
ఈ నరునికి !
ఏమిటో అయోమయం
ఇంతటి శక్తి పరునికి !

సారపు ధర్మాన్ని, విమల సత్యాన్ని
పాపం–బొంకు పట్టి పీడిస్తుంటే
పట్టించుకోని దక్షులను
శిక్షించే నాథుడెవరు?
ఈ హింసాత్మక ధ్వంసాత్మక భారతంలో
శాంతి రథం నడిపే సారథి ఎవరు?

నేనే
రథినీ సారథినీ
క్రీడినీ పేడినీ
నేనే
నరుడూ నారాయణుడూ నేనే
సమరాన్ని ప్రేరేపిస్తున్న
శాంతిన్ని కామిస్తున్న
సవ్యసాచిని నేనే—

మతం మీద మతం
మనిషి మీద మనిషి
దేశం మీద దేశం — భాష మీద భాష
ద్వేషాగ్నులు కురిపిస్తుంటే
భాషలేని దేశంకోసం — మతంలేని మనిషికోసం
వెతుకుతున్నాను నేను—

డొక్క చీల్చే డోలునునమ్మి
మోసాల ముద్దబంతులు
మెడనిండా వేసుకొని
స్వార్థాల ముంగిట్లో
కిరాయి నాట్యం ఆడే
డూడూ బసవన్నలకు
ప్రజాస్వామ్య పాఠశాలలో
ప్రగతి పాఠాలు నేర్పించే
ప్రాథమిక హక్కుల బుక్కులు చదివించే
గురువుకోసం గాలిస్తున్నాను
రోషంలేని వృషభన్నలను
విజయ భరత వీరన్నలుగా మార్చే
చక్రికోసం ఎదురుచూస్తున్నాను—

శాంతిని సాహిత్యం చేసి
సత్యాన్ని సంగీతంగా కూర్చి
నవయుగ గీతానాదం వినిపించే
గోవిందుని కోసం
నలుదిక్కులు కాస్తున్నాను—

కర్కట మకర రేఖలమధ్యే
కాలక్షేపం చేయక
శీతల బాధావాతాలను అరికట్టి
చీకటి సీమల్లో వెలుగు తోరణాలు కట్టి
ఉభయ ధృవాలను చుట్టుముట్టి
విశ్వంభర హృదయం నిండా
వెచ్చదనం పచ్చదనం నింపే
విప్లవ సూర్యుని కోసం
వినువీధులు శోధిస్తున్నాను.

# కవితా ప్రపంచం

అది
ఒక అద్భుత సన్నివేశం
అది, శాంతి సమతా సౌభాగ్య
సమైక్య గీతికా సందేశం
అది, ప్రపంచ కవితా విపంచి
''సేవాప్రియ'' నదీతరంగ తంత్రుల మీద
పలికించిన భావావేశం
అది ఒక అద్భుత సన్నివేశం—

అది
బౌద్ధధర్మ భర్మమకుట ధారిణి
స్వేచ్ఛామయ థాయిదేశం;
నవశకోదయ కాంతులు వెదజల్లిన
ప్రపంచకవుల దశమ సమావేశం
అది ఒక అద్భుత సన్నివేశం—

వేషభాషా విభేదాలు మరచి
దేశదేశాలు ఒక్కటై
సకల మానవ కళ్యాణ మంటపంలో
సత్య సాహిత్యోత్సవం జరుపుకున్నాయి—

అక్షాంశ రేఖాంశలవలె
అంతర్జాతీయత, ఆత్మీయత
అవనీ గోళాన్ని
ఆలింగనం చేసుకున్నాయి—

మదరాసునుండి మాస్కోదాక
కైరోనుండి కలకత్తాదాక
హైదరాబాదునుండి హాలీవుడ్‌దాక
ఏథెన్సునుండి టోకియోదాక
ఏకైక జీవనానుభూతి
ఏరులై ప్రవహించింది—

హిందూ మహా సింధుగర్భంలో
కాలం ఏడురంగుల కుంచెను ముంచి
ధరిత్రి సవిత్రి స్వప్నాలకు
యదార్థ రూపచిత్రం రచించింది—

బాపురే! అక్కడ నేను
స్పృశించిన
ప్రతిశిల తిరుమలయై
ప్రతి గుండె
శుభ్రజ్యోత్స్న పులకిత
సుందరారామంలో విరిసిన
మల్లెల మాలల కొండయై
వెలిగాయి—

అక్కడ నేను ప్రబుద్ధాత్ముడనై
అపూర్వ "ప్రేమపాత్ర" లో
ఆనంద భావదీపాలు ఆవిష్కరించాను
కవితా జైత్రయాత్రలో
కళా ఖచిత ఖగోళాలు దర్శించాను—

విజ్ఞాన వినయ చంద్రులు
ప్రజ్ఞాన కవి రాజేంద్రులు
ఆప్తులు అమరోద్దీప్తులు
స్నేహ శ్రీనివాసులు
ప్రతిభా పద్మనాభులు
అభిమానాంత రంగులు
దినమణి కిరణక్రాంతి శృంగులు
చైతన్య ఉమావిజానులు
నన్ను చేరదీసి ఆదరించారు
మానవతాతత్వ నిధిగా
మనసారా నన్ను సత్కరించారు.

అది ఒక అద్భుత సన్నివేశం
అది ఒక అమృత భావావేశం
అది
ప్రపంచ కవుల దశమ సమావేశం.

# రైతు సేవాంతరంగా!

నవంబరు ఏడు, పందొమ్మిది వందలు
పాతబడ్డ చరిత్రలో
మూతబడ్డ తారీఖు కాదని
నడుస్తున్న చరిత్రలో
నాయకుడవై వెలుగుతున్న నీవు
పుట్టిన రోజని గుర్తించి
పులకించి పోతున్నాము
పూజ్యరంగాజీ!
గోగినేని రంగనాయకులుగా
గుంటూరు మండలంలో పుట్టి
తెలుగుతల్లికీ భరతమాతకూ
వెలుగు తోరణాలు కట్టి
ప్రగతియాత్ర సాగిస్తున్నావు
రంగాజీగా రాణిస్తున్నావు—

ఇరువయ్యవ శతాబ్దాన్ని
ప్రారంభించిన నీ జీవితం
ఇరువయ్యొకటవ శతాబ్దాన్ని కూడా
ఆవిష్కరిస్తున్నది—
కాలపురుషుని కాంతి దూతవేమో నీవు
కాలాతీత జీవనజ్యోతివేమో నీవు
అందుకే
నిటారుగా నీవు నడుస్తుంటే
నింగినీ నేలనూ కలుపుతున్నట్లుంటుంది

చీకట్లు

మట్టిని నమ్ముకున్న రైతుల గోడు
మాధవునికి తెలుపుతున్నట్లుంటుంది
రైతుగా పుట్టి
రైతే ఇతివృత్తంగా రచిస్తున్న నీ జీవితం
అసంపూర్ణ రైతు రామాయణం—

భారత స్వాతంత్ర్య సమరంలో
బాపూజీకి అండగా నిలిచావు
దురాచారాలను దోపిడీలను
ఎక్కడున్నా ఎదిరించి
భూస్వామ్యాన్ని ధనస్వామ్యాన్ని
ఎల్లప్పుడూ ధిక్కరించి
ప్రజాస్వామ్యాన్ని కొలిచావు—

నీ కళ్ళముందే పుట్టింది
ఈనాడు జీవిస్తున్న
మానవకోటి అంతా
నీకు నిత్య నూతన యౌవనాన్ని
ప్రసాదిస్తున్న ఔషధం
నిర్భయంగా నిర్జరంగా
నీవు చేస్తున్న ప్రజాసేవే
ఓ నిర్మల భావాంతరంగా
రైతు సేవాంతరంగా !
సమతా సమాజ సముజ్వల భవిష్యత్
రచనాచార్య శ్రీరంగా
నీవు పుట్టిన రోజే రైతు పుట్టిన రోజు.

# ఇరువయ్యో శతాబ్దం

కాళ్ళు చేతులు ముడుచుకున్న
కాలాన్ని
కదిలించిన విప్లవజ్వాల
ఇరువయ్యో శతాబ్దం—
నేలమీద ప్రాకులాడే కాలానికి
గాలిలో ఎగరటం నేర్పిన
గంధర్వపక్షి, అంతరిక్షాక్షి
ఈ శతాబ్దం—
రెండు ప్రపంచయుద్ధాల గుండ్లు
తన గుండె గుండా దూసుకుపోయినా
భూగోళపు మట్టికుండను
భుజాన వేసుకొని
ఖగోళ వీధిలో తిరిగే
విజ్ఞాన ప్రజ్ఞాని ఈ శతాబ్దం—
నాడు, బాలరాముడు అద్దంలో చూచి
గోలచేయడం మానిన
చంద్రమండలం మీద
నేడు లీలగా కూర్చున్న
భుజబల బుద్ధి రాముడు
ఈ అనంతంలో నేనెంత అని
గోల పెడుతున్న శతాబ్దం ఇది—
ఊహించిన దేవుడంటే
ఉలిక్కిపడ్డ మనిషి చేత

**చీకట్లు**

ఊహించరాని మాయలు చేయించిన
యదార్థ యోగదండం
ఇరవయ్యో శతాబ్దం—

తరతరాల చరిత్రకు
గతితార్కిక వాదాన్ని నేర్పాలని
శ్రమశక్తి పీఠం మీద
సమతా వేదాన్ని నిలపాలని
చిందులువేస్తూ ఉదయించిన
కమ్యూనిస్టు సూర్యుడు
చేసిన తప్పులు గ్రహించి
సుదీర్ఘ స్వప్నం నుండి నిష్క్రమించి
స్వేచ్ఛాగానంలో పరవశిస్తున్న
చేదు నిజం ఈ శతాబ్దం—

నేనూ నీవూ పుట్టిన
జన్మదినం ఈ శతాబ్దం
నింగీ నేలా కలిసిన
పుణ్యక్షేత్రం ఈ శతాబ్దం
మానవత్వం—దైవత్వం
మనం మనం ఒకటేనని
మళ్ళీ గ్రహించి
స్వార్థపరత్వాన్నీ, సంకుచితత్వాన్నీ
పరపీడన పాపాన్ని
జయిస్తున్న
నవయుగోన్ముఖి
**ఈ శతాబ్దం.**

# సత్య శ్రీనివాసం

నవ్వుకుంటూ నవ్వుకుంటూ
రివ్వున ఎగిసిపోయావు
మాట్లాడుతూ మాట్లాడుతూ
మాయమై పోయావు
ఎక్కడికి వెళ్ళిపోయావు!

నీవు స్వదేశంలో లేనప్పుడు
విదేశాలకు వెళ్ళావని
సమాధానం చెప్పే
నీ సతీమణి
ఇప్పుడు ఏదేశం వెళ్లావో
చెప్పలేక కన్నీరైంది—

ఈ లోకాన్ని నాకం చేయాలని
పోరాటం ఆరాటం సాగించిన
మానవతా వాదివి నీవు
అభ్యుదయ వేదివి నీవు
అసలు స్వర్గం ఎలా వుంటుందో
చూచి వద్దామని వెళ్లావేమో
విశ్వ వీధుల్లో వెతుకుతున్నావేమో,

తిరుగులేని మార్గంలో
తీర్థయాత్రకు వెళ్లావని
తీరా తెలిసికొంటున్న కొలది

మతి పోతున్నది మాకు
మనసిచ్చిన నీ స్నేహితులకు—

ఉపకారాల పువ్వులేతప్ప
అపకారాల ముళ్లులేని
ఆత్మీయతా వల్లరి నీ జీవితం
మెత్త మెత్తని మాటలతో
కుత్తుకలు కోయడం తెలియని
పరుషవాక్కు నీది
పౌరుషవాక్కు నీది —

వ్యాపారాన్ని ఎగుమతి చేసి
స్నేహాన్ని దిగుమతి చేసిన
సత్యాన్వేషివి నీవు
నీతినీ నిజాయితీనీ
నిత్యజీవితం చేసుకున్న
ఇక్కడ
కె. శ్రీనివాసరావు నీవు
అక్కడ
శ్రీనివాసమే
నీ నివాసం చేసుకున్న
చిదానందుడవు నీవు !

# ఉదక మండలం

ఊటీతో పోటీ పడలేక
ఒప్పుకున్నాడు ఓటమి
కొండ క్రింద తన ప్రతాపం చూపే
కోరమీసాల సూర్యుడు—

నింగినంటే నీల గిరులు
తొడగొట్టి సవాలు చేస్తున్నాయి
మైదానాలపై
కేదారాలపై
మంటలు కురిపించే ఓ మార్తాండుడా!
ఖలేజా ఉంటే
మా మబ్బుల మదపుటేనుగులతో
ఢీ కొనుమని—

ప్రతి బండా ఒక పచ్చజండా పట్టుకొని
ప్రతి లోయా
ఒక పాతాళగంగ దుర్గం కట్టుకొని
అదరకుండా బెదరకుండా
ఎదిరిస్తున్నాయి
కొండ సానువులమీద భానున్ని
అందుకే
ఉదక మండలం అంటేనే
సూర్య మండలం
గజగజ వణికిపోతున్నది

ఋతుచక్రంతో ఆడుకుంటూ
చెట్లతో గాలి విసురుకుంటూ
పూలతో గంధం పూసుకుంటూ
హేమంత సీమంతినియై
వాసంత భాస్వంతినియై
చండభానుని శాసనం చెల్లదంటూ
ఉదక మండలాన్ని
చల్లగా పాలిస్తున్న
ఊటీ వధూటీ
తనకు తానే సాటి!

# ప్రేమాంజనేయులు

ఎక్కడికి వెళిపోయావు
ఎవరికీ చెప్పకుండా
గుట్టుగా ఎగసిపోయావా
గుంటూరు గూటిలోనుంచి
ఎవరిపిలుపో అంగీకరించి
ఏప్రిల్ ఇరవై రెండునాడు—

నీవు లేని గుంటూరు
తావిలేని పూవులా ఉంది
నీవులేని విజ్ఞానమందిరం
పూవులేని తీవెలా ఉంది

సభలూ సమావేశాలూ జరిపించి
సంతోషించే నీకోసం
సంతాప సభలు జరుపుకుంటున్న
సజలనేత్రులం మేము —

గద్గదగాత్రులం మేము —

వాత్సల్యం వర్షించి
త్యాగంలో పరవశించిన యోగివి
ఇటుక గోడల ఇంటిలోకంటే
సుస్ఫటిక హృదయ పేటికల్లో
నివాసం ఏర్పరచుకొన్న
నిరామయుడవు నీవు —

కళలన్నీ
శాశ్వతానంద నాద సింధువులో
బిందువులేఅన్న సత్యవేదివై
మనిషికి దేవునికి మమతా బంధం వేసే
లలితకళా పోషణలో
నిస్తుల సౌందర్య గవేషణలో
సంతృప్తి చెందినావు —

సీతారామాంజనేయులు అనగానే
నిరాశా శైశిరావృత సాహిత్యద్వీపంలో
ఆశల ఆమనులు విరిసేవి
స్తబ్ధమైన సంస్కృతీ సాకేతంలో
ఆనందవర్షాలు కురిసేవి
అందుకే
నీ స్మృతిలో, నీ ఆదర్శాల రుచిలో
ఈ నేల పులకించాలి
నీవు నాటిన మొక్కలన్నీ
నిత్యనందనాలై
మా ప్రేమ పరిమళ స్తబకాలై
నీ ఆత్మకు అంజలి ఘటించాలి

# రేపటి పేరు

"రేపటికి" ఏమి పేరు పెట్టాలో
ఈ రేయంతా ఆలోచిస్తున్నాను
మంచి పేరు పెట్టాలో
చెడు పేరు పెట్టాలో
నా మనస్సు నిర్ణయించలేక పోతున్నది –

మంచి పేరు పెట్టినంత మాత్రాన
మంచి జరుగక పోవచ్చని
చెడు పేరు పెట్టినా మంచి జరగవచ్చని
సందేహాల భయాల చీకటిలో
మిణుకు మిణుకు మంటున్నది
నా మీనమేషాలభాష –

ఆశ, పేరాశ, దురాశల మధ్య
అంతరం అంతరించి పోతున్న
ఈ నిరాశాయుగ సంధ్యలో,
నిన్న - నేడు - రేపు మధ్య
నీడలు ఆడుకునే
ఈ కాల లీలా కేళిలో
మంచి - చెడును నిర్వచించడం
వంచనగా తోస్తున్నది –

చెడు పేరు పోవటానికి
మంచి చేయాలనే చిత్తశుద్ధి
మంచి పేరు పెట్టారని

చెడు మానుకుకొనే త్యాగబుద్ధి
ఉంటే పరవాలేదు కాని
చేసేది చెడ్డైనా
పేరు మాత్రం మంచిది రావాలని
పెనుగులాడే వింతలోకానికి
పేరేమని పెట్టాలో తోచడం లేదు.

నిన్నటి పేరు, నేటి పేరు
రేపటికి వర్తిస్తుందా!
క్రొత్త పేరు పెడితే మరి
కాలం గుర్తిస్తుందా!

# ఇస్మాయిల్ విలాసం

శబ్దానికీ శబ్దానికీ నడుమ
వినిపించే నిశ్శబ్దం ఇస్మాయిల్
చెట్టుకూ చెట్టుకూ నడుమ
కనిపించే ఆకాశం ఇస్మాయిల్
మృత్యు వృక్షం మీద వ్రాలి
సత్య ఫలాలు చవిచూచే
పలుకు చిలుక ఇస్మాయిల్
రహస్యాల రాత్రి గాత్రంమీద
కురుస్తున్న
సుస్పష్టమైన చుక్కలవాన ఇస్మాయిల్
తత్వానికి కవిత్వం
కవిత్వానికి తత్వం
నేర్పిస్తున్న మానవత్వం ఇస్మాయిల్
వేయి వసంతాలు వెదకి వెదకి
తెలుగు కవిత్వం తెచ్చుకున్న
వాడిపోని తావిచెట్టు ఇస్మాయిల్
బాపురే!

సహజధర్మ గిరులమీద
శ్యామల ప్రేమారామాలలో
సూర్య చంద్రుల కాంతి కౌముదులు
అభినందన కిరణాలు చల్లుతుంటే
షష్టిపూర్తి జరుపుకునే
సాహిత్య కీర్తి ఇస్మాయిల్

# విశ్వంభర వీణా పాణి

ఆచార్య నారాయణరెడ్డి!
సాహిత్య తపస్సులో నీ మనస్సు
కూర్చున్న మట్టిగద్దె
జ్ఞానపీఠం అయింది
నెరసిపోతున్న నీ నీలాలకలు
శివసుందర సత్యాలు కురిపిస్తున్న
మేఘ కిరీటం అయింది-

కపటనాటక కీటకాల విలాసం కోసం
నవ్వని నీ తొలి కావ్యపు పువ్వు
కష్టజీవుల కన్నీటిని తుడిచే
కర్మయోగ నాగార్జున సాగరంలో
నవజీవన కాసారంలో
పద్మశ్రీయై నవ్వింది
రసానందమందిరంలో పరిమళించింది-

వెన్నెల వాడల్లో విహరించిన
నీ ప్రణయరాగ చకోరాలు
రామప్పగుడిలో రవళించిన
నీ ప్రణవభావ మంజీరాలు
స్వేచ్ఛా ఉదయపు హృదయంలో ఘోషించిన
నీ ప్రగతి ఋతు చక్రాలు
తెలుగు గుండెల వెండితెరమీద
బంగారు తీగలై సాగుతున్నాయి
విశ్వంభర వీణాశ్రుతులై మ్రోగుతున్నాయి-

సంప్రదాయానికి ప్రయోగాన్ని
ప్రయోగానికి సంప్రదాయాన్ని
ప్రాణభిక్షగా పెట్టిన
పురోగతి వితరణ శీలివినీవు
కాలపు తీర్పు ఇచ్చే మార్పు వసంతాలలో
మాయని మానవత్వ కర్పూర కేళివి నీవు-

హిమాలయాల ఔన్నత్యాన్ని
హిందూమహాసముద్రపు గంభీరత్వాన్ని
స్పర్శించే నీ ప్రతిభా పాండిత్య పక్షాలు
అక్షరాల గవాక్షాలు
అందుకోలేని ఆకాశాలు లేవు
అందుకే
భారత భారతి నీమీద పెట్టుకున్న
ఆశలకు అంతులేదు।

# భావ రేఖలు

సంహరణం కాదు చేయవలసింది
సంస్కరణం
మరణం కాదు కావలసింది, మార్పు

*          *

రంగులు పూచే చెట్లమీద రక్తంపూస్తున్నది
కాలమే కంపించి కెవ్వున ఏడుస్తున్నది

*          *

ఓహో! ఆహా! అనగానే ఉప్పొంగిపోకు
కుహూ కుహూ మనేవన్నీ కోకిలలనుకోకు

*          *

ఉగాదిని ఎగాదిగచూచి
ఓహో! ఆహాలో పడకు
పచ్చడిమీద ముచ్చట పడి
ప్రశంసా పత్రాలు ఇడకు

*          *

ఓ ఆమనీ!
అరణ్యంలో నుంచి జనారణ్యంలోనికిరా!
ఆవేశంలో నుంచి కాస్త ఆలోచనలోనికిరా!

*          *

చీకటి కూకటివ్రేళ్లను
పెకిలించే కిరణాన్ని నేను
గుడ్లగూబల గుండెల్లో గునపాన్ని నేను

ఏడుసముద్రాలను కలిపే
గాలి పడవను నేను
ఎడారుల ప్రాణం నిలిపే
ఒయాసిస్సును నేను

* *

మార్తాండునికి మసిపూస్తే
మహోదయం ఆగుతుందా!
మైకులన్నీ తీసివేస్తే
మాట పలుకుట మానుతుందా!

* *

కొండమీద కొండబెట్టి
'ఏడుకొండలు' చేయలేవు
మంచుమీద మంచుపేర్చి
'మంచు కొండ'ను చేయలేవు

* *

చుక్కలకు రెక్కలుతొడిగి
శూన్యంలోకి ఎగరవేస్తున్నాను
కాలానికి కాంతి కళ్లెంవేసి
దేశమంతా త్రిప్పుతున్నాను

* *

కవిత్వాన్ని రాజకీయంచేసే
కాకితత్వం పోవాలి
రాజకీయాన్నికూడా కవిత్వంచేసే
కోకిలత్వం రావాలి

* *

మానవత్వపు గుండెలో
మండేలావా మండేలా అని
దానవత్వం గ్రహిస్తూంది
ఉప్పెనలా ముంచుకువచ్చే
ఉర్వీతల సర్వేజన సత్యాగ్రహం నుంచి
రక్షించే రంగులు హంగులు లేవని
దక్షిణాఫ్రికాలో డేరావేసిన
రాక్షసత్వం తలవంచుతూంది

★ ★

ప్రేమం కామం పెనవేసుకున్న
నిత్యసత్య జీవితం
నింగినీ నేలనూ కలిపే
దిక్కులేని దిక్చక్రం

★ ★

అహల్యతో కూడిన ఇంద్రుడు
తార కౌగిలిచేరిన చంద్రుడు
నాడు నడిపిన శృంగార ప్రబంధం
నేటికి చిలుకుతూంది మత్తుగంధం

★ ★

సమతావిప్లవం విఫలమైతే
సాయుధ విప్లవం తప్పదేమో

★ ★

ఎంతవేదాంతం వల్లించినా
ఎంతసారూప్యం చూపించినా
నిన్నుమాత్రం మరవలేకపోతున్నాను

★ ★

ఈ దేశంలో ధరలు పెరుగుతున్నాయంటే
నేను ఒప్పుకోను
వస్తువుల విలువలు పెరుగుతున్నాయి
మనుషుల విలువలు తరుగుతున్నాయి
సగటులో మార్పులేదు
ఉత్పత్తులు పెరగటం లేదనటంకూడా
యదార్థంకాదు
సరకుల ఉత్పత్తి సేవల ఉత్పత్తి
తరగవచ్చు
కాని జనాభా ఉత్పత్తి ఎన్నోరెట్లు పెరుగుతూంది
"సగటు" పరిస్థితి సంతృప్తికరంగానే ఉంది

★ ★

తెగిపోయిన దిక్చక్ర రేఖమాత్రమే
తెలుపుతుంది
పర్వతాలు మనచుట్టూ
పరిరక్షకభటులై ఉన్నాయని

★ ★

దినమంతా కష్టపడ్డ కార్మికులు
రాత్రికన్న కలలపంటవలె
ఆకాశ క్షేత్రంలో
నక్షత్రాలు పండాయి

★ ★

చీకట్లు

అనుభవించినదాన్ని
అభివ్యక్తం చేయలేని
అర్భకుణ్ని నేను
అభాగ్యుణ్ని నేను

* *

ఆశ నా భాష
ఆలోచన నా శైలి
ఆవేశం నా శిల్పం
ఆనందం నా భావం
కవిత నా బ్రతుకు

* *

నీతి కొండలను త్రవ్వి
అవినీతి ఎలుకను పట్టకు
అవినీతి రాబందుల్ని కొట్టి
పాపభీతి కలిగించే కొండలా కుప్పబెట్టు

* *

నెత్తిమీద నేను కట్టుకున్న
నీలాల నింగికోట
కాలం చేసిన మాయదాడిలో
నేలమీద రాలిపోతున్నది —

* *

తెలుగువాని పేరేమిటంటే
తెలియదనండి
ఎందుకంటే, మేము
ఒకరినొకరం గుర్తించలేమనండి

# కాలం వేసిన గాలం

యౌవనం వృద్ధాప్యాన్ని
ఎదిరిస్తున్నది
అయినా ముదిమి, బెదరకుండా
వయసు వాకిట్లోకి చొచ్చుక వస్తూనే ఉన్నది
విర్రవీగే నా దేహ దుర్గాన్ని
వింత వింతగా ఆక్రమిస్తూనే ఉన్నది —

కామగానం వినిపించే
గండు తుమ్మెదల్లాంటి నా తల నీలాలను
సామగానం వినిపించే
వెండితీగెల వీణగా మారుస్తున్నది —

చెక్కు చెదరని వజ్రాల్లాంటి నా పళ్లను
ఒక్కటొక్కటిగా పీకేస్తూ
పసితనం మళ్లీ నీకు వస్తున్నదని
పరిహాసం చేస్తున్నది —

కనిపించేదంతా కాంతిలోకం అనుకున్న
నా కనుల గనుల్లోకి
మసక చీకటిని చిమ్ముతూ
బయటకాదు చూడవలసింది
లోనికి నీలోనికి అంటూ
ధూపదీపమేదో పట్టింది —

## చీకట్లు

కొండలనుకున్న నా కండరాలను
పిండిపిండిచేస్తూ
ముడుతలు ముడుతలుగా మలుస్తూ
గర్జించే సింహంలాంటి
నా అహంభావాన్ని
గంగిగోవును చేస్తూంది —

ఇన్నాళ్లు నన్ను నెలబెట్టిన
వెన్నుపూసను
తన విల్లు చేసుకొని
నా నరాలను నారులుగా బిగించి
తిరుగులేని మరణ బాణాన్ని
నా మీదికే ఎక్కుపెట్టి
లొంగదీసుకుంటున్నది నన్ను
వయసు మాటున పొంచి ఉండి —

అయినా నా మోహబుద్ధి
ముసలి తనాన్ని అసహ్యించుకుంటూ
ముందుకు సాగుతూనే ఉన్నది
కోర్కెల జండా పట్టుకొని
నా కళేబరం కేకలేస్తూనే ఉన్నది
కాలం వేసిన గాలానికి
నా ప్రాణం గింజుకుంటానే —

# సేవా ప్రియా!

సేవా ప్రియా చావో ప్రాయ్
నా స్వప్నాల రాణీ
విన్నాను నీ హృదయ వీచికా వాణి.
థాయి దేశపు శక్తి రక్త నాళ తంత్రులు
మ్రోగుతున్నాయి
నీ తరుణ భావలహరుల్లో
బ్యాంకాకు నగరంలో
బంగారు చిలకవు నీవు
గంగా యమునలు
వోల్గా హొయాంగువాలు
రైను నది, నైలు హృది
నీ సింగారపు సిరులు చూచి
అసూయ పడుతున్నాయి
అందరికన్నా చిన్నదానివే అయినా
ఆ సరసాల సాగరునికి
నీ వంటేనే
చచ్చేటంత ప్రేమట—

వెండి వెన్నెల రాత్రులన్నీ
పెచ్చు పెచ్చుగా కలిసిపోతున్నాయి
నీ ఒయారపు నడకల్లో.
అందాలూ ఆనందాలూ కలిసి
విందు చేసుకుంటున్నాయి

చీకట్లు

నీ లీలాచేలాంచల తటాల మీద.
నీ స్వేచ్ఛా యదేచ్ఛా జీవన
నిర్నిద్ర రాగాలలో పరవశించి
ప్రపంచ కవులందరూ
పాటల్లుల కుంటున్నారు
నరలోకాన్ని సురలోకం చేస్తున్న
నాద వేణివి నీవేనని
కావ్యాలల్లు కుంటున్నారు
స్వర్గం వీడి దేవతలే
నీ సన్నిధికి చేరుతుంటే
భూలోకం విడిచిపోవడాకిని
నాకు బుద్ధిపుట్టడం లేదు

# ప్రమాదాల ప్రమోద

నిరాశలకు నిట్టూర్పులకు
మరుపు పూల రంగులు పూస్తూ
అపజయాల ఆవేదనలకు
కోకిల మధురాలాపాల
మత్తుమందు పోస్తూ
ప్రాణాలు పోతున్న వాళ్ళకు
పంచాంగాలు వినిపిస్తూ
వేప చేదు నిజాలకు
తీపి బెల్లం తినిపిస్తూ
వచ్చింది
ప్రమాదకర మధుమాసం
ప్రమోద దాతనంటూ.

ఉగాది పేరు చెప్పుకొని
ఊళ్లో వాళ్లందరి చేత
సన్మానాలు చేయించుకుంటున్న
ఈ సంవత్సరాదిని నమ్మను
అసలు రంగు తేలేదాక
ప్రశంసల అత్తరులు చిమ్మను—

పై పై పూతలు చూచి పకిలించే
పసివాణ్ని కాదు నేనిప్పుడు
కుహూ కుహూమని కూసేవన్నీ
కోకిలలే అనుకొని మురిసిన

అమాయకుణ్ని కాదిప్పుడు
గున్నమావికి ఎండమావికి
తేడా గుర్తించలేని
గ్రుడ్డివాణ్ని కాదు నేనిప్పుడు
మండే లావాలో మండేలా ఉంటాడని
మర్మాలు తెలుసుకుంటున్న
మార్తాండుణ్ని నేనిప్పుడు
స్వదేశ భక్తిని విదేశ శక్తులు
సరిహద్దుల్లో ఎలా ఖరీదు చేస్తున్నాయో
గ్రహిస్తున్న బుధ గ్రహాన్ని నేను ఇప్పుడు
చీకటి మబ్బుల ఖాతాల్లో
దాచుకుంటున్న మోసాలను
పసికడుతున్న చంద్రహాసాన్ని నేనిప్పుడు
అందుకే
వాదాలకు ఉన్మాదాలకు మధ్య దూరం
మిధ్యచేస్తున్న అద్వైతులకు
దూరంగా ఉంటున్నాను
సత్యాన్ని హత్య చేయడానికి
సాధనాలు ఎన్ని ప్రయోగిస్తున్నారో
తెలిసికొని కనులు తెరచుకొన్నాను
భద్రత కోసం నిద్రమాని
అనిమిషున్నై పోతున్నాను

# శూన్యంలో ఈశాన్యం

నిస్తుల శక్తి సంపన్నుడు
నీలాకాశ స్వరూపుడు
వేంకటేశ్వరుడు వెలసిన
తిరుమల దివ్యక్షేత్రపు
వాస్తు శాస్త్ర వాస్తవికతను
నా సత్యవృత్తి శోధిస్తుంటే
సప్తగిరి శిఖరాలమీద
నా సుప్త చైతన్యం వికసించింది—

శూన్యపు ఈశాన్యంలోని
పాలపుంత కాంతి కడలిలో
కుండలీకృత కాలసర్ప పర్యంకం మీద
పవళించిన పరమాత్మను
భావించి సేవించాను
దర్శించి పరవశించాను—

చరిత్రకందని చరిత్ర గర్భ
శిలాతోరణం క్రింద
మట్టికి ప్రాణం పోసిన
మహారణ్య మౌనంలో
నా యోగ ముద్రిత నయనాలు
ప్రదీప్త భానుబింబాలై లేచాయి

## చీకట్లు

దిక్కులేని అంతరిక్షంలో
దిక్కుల దీపాలు వెలిగించాయి
హద్దులులేని నా ఆత్మాలయానికి
శ్రీకార శ్రీనివాస సౌధానికి
ప్రాకారాలు నిర్మించాయి
అందులో
నా జీవిత తారక
బ్రహ్మోత్సవం జరిపించాయి.

# అందాల కోవెలం

ఎండల గోచీలు పెట్టుకొని
కొండలు స్నానాలు చేశాయి
కోవెలం బీచిలో—

నగ్నంగా లేచిన తరంగాలు
నర నారీ హృదయాలను
ఆత్మదఘ్నంగా అలుముకున్నాయి—

అమ్మచేతుల్లో ఆడుకునే శిశువుల్లా
ఆడా మగా తేడా లేకుండా
అందరూ ఆడుకున్నారు—

కొండంత ఉత్సాహంతో
ఆ కడలి కెరటాల కౌగిట్లో
త్రివేంద్రం తీర్చిన
ఆ చలివేంద్రంలో
తప్తాత్మలు దాహం తీర్చుకుంటున్నాయి
సమతా తత్వంలో సంతృప్తాత్మలై—

ఒంటిమీది గుడ్డలు ఊడ్చివేయగానే
కంటిమీది పొరలు కరిగిపోతాయేమో!
అందుకే
ఒకరినొకరు చూచుకుంటున్నారు
త్వమేవాహంగా
ఎవరికి వారు భాసిస్తున్నారు
సోహంగా, రసోహంగా

## చీకట్లు

హఠయోగుల్లాగ
నీటి కెరటాలమీద కదలివచ్చే
గాలి కెరటాలను
బొండాల జండాలు పట్టుకొని
కొబ్బరి తోటలు ఆహ్వానిస్తున్నాయి
కొసరి కొసరి కోర్కెలుతీర్చే తీరానికి —

భాషలన్నీ ఒక్కటైపోయాయి
ఆ మహాసాగర ఘోషలో
జాతి భేదాలు కరిగిపోయాయి
ఆ మానవతా వారాశిలో
వికృతాకృతులు వీడిపోయిన
ఆ ప్రకృతి సౌందర్య దర్శనంలో
నింగిలోని ఆ రవి
నేలమీది ఈ కవి
ప్రాయేటి నీటి లోతుల్లో
పరవశించి పోయారు.

# మధుమాసంలో మోసం

మోసం మధుమాసంలా
వేషం వేస్తుందనుకోలేదు
ఆశల కాశ్మీరానికి
అగ్గిపెడుతుందనుకోలేదు
రాగాలు విరిసే మంచుమలకొమ్మ
రక్తాలు పూస్తుందనుకోలేదు
అమృతం పంచవలసిన
ఐదు నదుల వ్రేళ్ల హస్తం
అమాయికుల కుత్తుకలు
కోస్తుందనుకోలేదు
మృత్యువుతో నేస్తం చేస్తుందనుకోలేదు—

అడవులారా! కొండలారా!
అజ్ఞాతపులోయల గుండెలారా!
ఈ విద్వేషపలాశ కుసుమహాసం నమ్మకండి
ఈ మధుమాసపు మోసంలో పడకండి

మనిషినిచంపి మనిషిని బ్రతికిస్తామనే
మాయలో చిక్కకండి
అడిగితేకూడా పెట్టదనే అపోహతో
అమ్మరొమ్ము చీల్చకండి!
ఓట్లచెట్లమీద పూయవలసిన పూలు
బుల్లెట్ల మీద పూస్తాయా!
సదాలోచనకు సాధ్యమయ్యే వెలుతురు
దురావేశానికి దొరుకుతుందా!

పికాల బాకాలు చిలికే స్వరాలు
తుపాకి గుండ్లు పలికిస్తాయా!

పుస్తకాలలో ఉన్నదంతా
వాస్తవమేనని విశ్వసించి
మీమస్తకాలు పాడుచేసుకోవద్దు
వాదాలకు ఉన్మాదాలు బోధించే
వసంతాలు మనకువద్దు
వేదనాదాలకు, నినాదాలకు
ముడివేసే
వివాదాలు మనకువద్దు—

రాళ్లల్లో చిక్కుకున్న
మన సుందరస్వప్న శిల్పాలు
బద్దలు కొడితే బ్రతకలేవు
భయపెడితే బయటికి రావు—

నేటి ప్రపంచం వినిపించే
పంచమస్వరం—శాంతి
నేటి సమాజం చిత్రించే
ప్రగతి వర్ణం—సహనం
నేటికాలం ప్రతిపాదించే
కార్యాచరణం—సంస్కరణం
అందుకే
సత్యమార్గంలో సాగిపోయే
మన ఆశల ఆశయాల రధానికి
కట్టండి "అహింసా హంస" కేతనం
నిలబెట్టండి మన నిత్యనూతన చేతనం

# చెన్నారే కార్యదీక్ష

కాలం విరిసే
లీలా వసంతాలను
పూల దండగా కూర్చుకొని
నిత్యచైతన్య జీవిత బృందావనంలో
కల్యాణ భావవేణువు పలికించే
గోపాలుణ్ని
కష్టజీవుల కలలుపండించే
కార్యదీక్షతో చెన్నారే భూపాలుణ్ని
కనులారాచూడరండి!

అదుగో!
అనంతత్వతత్వతారా పథాలలోనికి
ఆలోచనల రాడారులు విసిరే
ఆయన
నిర్నిద్ర చకచ్చకిత చంచన్నయనాలలో
భారతి వికచాశయాలు భాసిస్తున్నవి—

సూటిగా చూచే ఆయన ముక్కుమీద
మొక్కవోని మేటి మేధాశక్తి
విద్యుద్విన్యాసం చేస్తుంటే
చిద్విలాస శివతాండవం ఆడుతుంటే
సోమరితనం, శివశివా అంటూ
కిటికీదూకి పారిపోతున్నది
తాబేలు కాబోలు అనుకున్న ప్రగతి
కుందేలులా ముందుకు సాగుతున్నది—

## చీకట్లు

శ్రీరామ రామరామాక్షర
శ్రీకార ఓంకార స్వనాలు
ఆయన ఉచ్ఛ్వాసనిశ్వాసల్లో
ఉయ్యాల లూగుతున్నవి
నరలోకపు పొదుల్లో నుంచి
సురలోకపు పందిళ్లపైకి
అలవోకగా తీగలు సాగుతున్నవి
ఆయన అనంత భావనాలతలు—

అటు చూడండి
ఆయన అరచేతుల్లో ఆడుకొనే
రజతాంచల రక్షాదండం
అశేష పీడిత జనవాటికి
అభయకోదండం వలె లేదా!
నేటికి ఏనాటికి ముమ్మాటికీ
జలచర వనచర ఖేచర కోటికి
అది త్రివిక్రమ త్రికాలదండం కాదా!

రంగురంగుల అనుభూతుల సింగిణులు
తొంగిచూచే
ఆయన బుద్ధాత్మక
శిరశ్శితాచల తేజశ్శిఖరాలమీద
ఆకలికి అన్నంపెట్టే
అమ్మలాంటి దరహాస వదనునిమీద
చల్లండి, అభినందన చందన పింజాలు
చల్లండి,
అహంబ్రహ్మాస్మి అంటూ
ఆశీరక్షతల పుంజాలు

# సత్యదర్శనం

"ఓం తత్ సత్యం
ఓం తత్ సర్వం" అంటూ
పురోహితుడు
మంత్రం పఠిస్తుంటే
స్వప్నాల కళ్ళుతొడుక్కొని
సత్యాన్ని దర్శిస్తున్నట్లు
స్పందించిపోయాను
నేను తెలుసుకోలేననుకున్న సత్యం
తెలిసిపోతున్న అనుభూతిలో
తేలిపోయాను—

ఊరూ పేరూలేని ఆ సత్యాన్ని
"ఓం ఓం" అంటూ ఉచ్చరిస్తున్న
వేదపారాయణుడు
నాచేత సత్యవ్రతం చేయిస్తున్న
నారాయణుడుగా భాసించాడు
సత్యమే నారాయణుదని
స్ఫురించగానే
సత్యనారాయణ వ్రతాన్ని
సంపూర్ణ విజ్ఞాన యజ్ఞంగా
ప్రజ్ఞానప్రణవ పథంగా
సంభావించాను—

చీకట్లు

లోకంగానిలోకం సత్యలోకం
భామగానిభామ సత్యభామ
వ్రతంగాని వ్రతం సత్యనారాయణ వ్రతం
అని మోషించే
నా అంతఃకరణ ప్రవృత్తిలో పడిపోయాను
"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ" అంటే
సత్యాన్ని శరణుబొందు మని
సత్యమే ఆదేశిస్తున్న
ఓంకార శంఖారావం విన్నాను
అర్థంలేని అనంత సత్యానికి
అర్థం కలిపించే
ఆత్మజానాన్ని ప్రబోధించే
పరమార్థ పార్థసారధినికన్నాను

# ఆశావాది ఉగాది

రమ్మన్నా వద్దన్నా
తెస్తుంది ఉగాది
తెమ్మన్నా వద్దన్నా
తెస్తుంది ఆశల వసంతాన్ని—

మోడుబారిన చెట్ల గుండెల్లో
చైతన్యం ఆరిపోలేదు
ఎండిపోయే గాలి గొంతుల్లో
ఆవేశం రాలిపోలేదు
పగిలిపోయిన పాతకడవలోని
పాయసం
క్రొత్త కుండలో కూడా ఉంది అంటూ
నిత్య సత్యాలనూ, నిగూఢ తత్వాలనూ
రంగరిస్తూ వచ్చింది ఉగాది—

రమ్మన్నా వద్దన్నా వస్తుంది ఉగాది
రాళ్లలో చిక్కుకున్న శిల్పాలు
బయటపడే కిటుకు తెలుసుకుందట
బీజంలో పడిపోయిన భూజం
గట్టెక్కే గుట్టు కనుక్కుందట
పేదరికాన్ని పిండిపోస్తున్న
(దో) పిడికిలిని
చిత్తు చేసే సత్తు తనకుందట
దురాశా నాగసర్పాల

చీకట్లు

నల్ల తలల ఖాతాల్లో దాగిన
విలువలేని రత్నాల నిలువల్ని
వెలికితీసే విద్య నేర్చుకుందట
మరి, ఈ ఉగాది
మామూలు పచ్చడి పండుగకాదట
శైశిర పాశవ శక్తులకు
చరమగీతం పాడే చైత్రోదయమట —

అరణ్యంలో అల్లాడే అజ్ఞాత వసంతాన్ని
జనారణ్యంలోకి రమ్మంటూంది
గట్టుమీద కాదు
ఓట్ల చెట్లమీద కూర్చుని
మార్పు గీతాలల్లు మంటూంది
కొండల్లో కాదు
ప్రజల గుండెల్లో పాడుమంటూంది
తుపాకిగుండ్ల నెత్తురు పాటల్లోని
త్రుప్పు పట్టిన విదేశి బాణీలతో
విసిగిపోతున్న స్వదేశానికి
శాంతి విప్లవం ఇమ్మంటూంది—

అవును, ఆశోన్మాది, ఆలోచనావాది, ఈ ఉగాది
అందుకే
ప్రమాదభరిత వాతావరణంలో నుంచి
ప్రమోదభరితనంటూ వచ్చింది
వస్తూ వస్తూనే ఈ వసంతానికి
క్రొత్త వన్నె తెచ్చింది—

ఈ వాణిభాషలో, భావంలో
సద్యోజాత పరిమళాలు గుబాళిస్తున్నాయి
గర్జించిన గాండ్రించిన, పర్జన్య శంఖాలు పూరించిన
సాయుధ రక్తపాత విప్లవాలూ
సమత పేరుతో స్వేచ్ఛను చంపిన
అరుణావేశ సమాజాలూ
చేసిన తప్పు ఒప్పుకుంటున్న తరుణాలోచన ఈ ఉగాది
చేదు నిజం ఈ ఉగాది—

ఈ ఉగాది మోసుకొచ్చింది భయంకాదు-అభయం
ఈ ఉగాది ప్రబోధించేది
సిద్ధాంత బుద్ధికాదు, త్రికరణ శుద్ధి
చిలుక పలుకులు కాదు-స్వతంత్రాలోచనా శక్తి
ఇజాలు కాదు, బ్రతుకు నిజాలు
సంహరణం కాదు-సంస్కరణం
మరణం కాదు - మార్పు

# మనిషిపై దూకిన మహా సముద్రం

సముద్రునికి ఒళ్లు మండితే
గట్లను గీట్లను గుర్తించడు
వాయు గుండాల జండాలు పట్టుకొని
కారు మబ్బుల జడలు విరబోసుకొని
విలయ తాండవం చేస్తాడు
అందుకే మొన్న ఉన్నట్టుండి
ఆంధ్రప్రదేశ్ మీద పడి
ఆవేశం కావేషం కురిపించాడు—

దద్దరిల్లిన ఆకాశం
కళ్లు మూసుకుంది
పట్టపగలే అంధకారం
నేలను అలుముకొంది
ఊళ్లన్నీ నీళ్లై పోయాయి
పట్టణాలు చెట్టు కొమ్మలను
పట్టుకొని వ్రేలాడాయి
ప్రకృతి యంత్రాంగం వికటించింది
ప్రజా జీవనం స్తంభించింది
ప్రభుత్వ యంత్రాంగం ప్రజ్వలించిందిం—

నీటి బాణాలతో గాయపడ్డ గాలి
గోల పెడుతూ
దిక్కు దిక్కున పరుగెత్తింది
కాటు పడ్డ కాళ వ్యాళం లా

బుస కొట్టింది
ప్రాణం పోసే గాలీ నీరూ కలిసి
ప్రజల ప్రాణాలు పీల్చేశాయి
జీవన సాధకాలను కూల్చేశాయి—

రైలు రెక్కలు ముక్కలైనాయి
రోడ్ల డొక్కలు చెక్కలైనాయి
పశువులు అసువులు కోల్పోయి
మట్టిలో మురిగి పోయాయి
పక్షులు గూళ్లు కోల్పోయి
గాలిలో కరిగి పోయాయి
చరిత్రను మూటగట్టు కున్న చెట్లు చిట్లి పోయాయి
శక్తినీ శబ్దాన్నీ ప్రసరించే తంత్రులు మూగబోయాయి

గండ్లు పడ్డ చెరువులు రువ్విన గుండ్లు
చెట్ల కొమ్మల్లో చిక్కు పడ్డాయి
కన్నీటితో తడిసిన పూరిగుడిశెలు
కడలి నీటి తాకిడికి కన్ను మూసాయి
పేదవాళ్ల ఇంటి కప్పులు
పెనుతుపానుకు బెదరిపోయి
నేలమీద తలదాచుకున్నాయి—

ప్రధాన మంత్రి, ముఖ్య మంత్రి
హెలీకాప్టర్లై ఎగసి వచ్చారు
అభయ హస్తాలు అందించారు
దానశీలురు సామాన్యులు
సానుభూతితో స్పందించారు

నాటకీయంగా జరిగిన
ప్రకృతి వైపరీత్యంలో
మనిషి మీదపడ్డ మహా సముద్రం
మనిషి విలువను పరీక్షించింది
మనిషికి తోడు మనిషి ఉన్నాడని
మానవత్వం పరిమళించింది
దూరాచార శిశిరంలో కాస్త
దయాచారం పల్లవించింది.

# కాకిగోల

కోకిలలు చిందిస్తున్న పాటల్ని
కాకులు పరీక్షిస్తున్నాయి
పువ్వులు కురిపిస్తున్న నవ్వులకు
బండరాళ్లు విలువకడుతున్నాయి
"కోహం" అని ప్రశ్నిస్తూ
"సోహం" అని ప్రవచిస్తూ
సాగిపోతున్న సత్యాన్ని
సమతా సాహిత్యాన్ని
రంకు బొంకుక-కులు
చీకాకులు పెడుతున్నాయి
సరసభావసంతాలను
విరసాలు నిరసిస్తున్నాయి
అవును
గుండెమావుల గుబాళింపులు
ఎండమావుల కెలాతెలుస్తాయి ?
కొసరి కొసరి పాడే కోలల విలాసాలు
గ్రుడ్డి కొంగల కెలా తెలుస్తాయి ?
నింగిలో తేలిపోయే మబ్బుల్నిచూచి
బావిలోని కప్పలు గోల చేస్తే
గాలిలో తూలే పూల బ్రతుకుల్ని
రాలురప్పలు గేలిచేస్తే
వన్నెతరిగే దెవరికి!
గగనంలోని నక్షత్రాలకంటే
గాజు పెంకులే పెద్దవని
వాదించే కాకులు
వైతాళికులుగా వెలిగినంత మాత్రాన
అసలువెలుగు అరిపోతుందా!

# రంగురంగుల చీకట్లు

అర్ధరాత్రి ఉదయించిన
భారత స్వాతంత్ర్య భానువు
అధిరోహించిన ప్రగతిరథాన్ని
చెదరిపోయిన చీకట్లు
వెలుగు వేషం వేసుకొని
వెనక్కిలాగ జూస్తున్నాయి
తూర్పు పడమరలను
నేర్పుగా మార్పుచేస్తూ
దిక్కు తెలియని ఆకాశంలోకి
దుర్బుద్ధితో తోసేస్తున్నాయి.

ఆగస్టు పదిహేను అర్ధరాత్రి
త్యాగం చేతిలో ఓడిపోయిన
తరతరాల తమసత్వం
స్వార్థపర కౌరవత్వం
వేషాలు వేసి, మోసాలు చేసి
వీరభారత ప్రజలమీద
విజయం సాధించాలని
వింత ప్రయత్నంచేస్తున్నది.

స్వాతంత్ర్యం ఎవరుతెచ్చినా
ప్రజాస్వామ్యం ఎలా వచ్చినా
వాటిని వంచించి పీడించే యుక్తి
నాకు మాత్రమే తెలుసని

కామరూపిణి స్వార్థం
ప్రేమగీతం తుపాడున్నది.

చీకటి వేస్తున్న ప్రణాళికలో
ప్రతిభకాదు కావలసింది
పలుకుబడి
గుణం కాదు అర్హత — కులం
దేశం కాదు ముఖ్యం — వేషం
పెట్టటం కాదు గొప్ప — పడకొట్టటం
లక్ష్యం సీటు, సాధనం ఓటు
తదితరం చేటు.

చీకటి రథానికి పథం లేదు
అది ఎటుపోతే అదే దానిపథం
అంధకారానికి బాధ్యతలు లేవు
అధికారం అహంకారం తప్ప
మనుషులు
ప్రేమించడం, జీవించడం కాదు
దాని సంస్కృతి
ద్వేషించటం, నటించటం

చీకటి నల్లగా ఉంటుందని
సామాన్యుని ఊహ
కాని అది ఈనాడు
తెల్లగా, ఎర్రగా
రంగు రంగుల్లో

రంగం మీద నాట్యం చేస్తున్నది
అందుకే దాన్ని గుర్తించి పట్టుకోవటం
అసాధ్యమైపోతున్నది

"నల్లబజారు, నల్లధనం అంటూ
మాకు నల్లతనం అంటగడతారా
ఏమి మేమంత నల్లగా ఉన్నామా" అని
అవి పరిహాసమాడుతున్నవి
రంగు రంగుల చిలకలై
రాగాలు పాడుతున్నవి
వేషాలు వేసే చీకటిని
వెలుతురు పట్టుకోలేకపోతున్నది
విద్వేషాలు రేపే మనిషిని
దేశం తట్టుకోలేకపోతున్నది.

హక్కుల్ని అడవులోకి త్రోసి
అన్యాయంతో, అవినీతితో దోస్తీ చేసి
చిరంజీవి చీకటి
సామ్యవాద సమతావాద
స్వాతంత్ర్యవాదపు గొంతును
నలిపేస్తున్నది.

చీకటికి లేని స్వేచ్ఛ
వెలుతురు కెక్కడిదంటున్నది
స్వార్థాన్ని మించిన
పరమార్థం లేదంటున్నది.

డెమక్రసీని హిపక్రసీ నడుపుతున్నది
తెలివిగలవాళ్లకు
త్రికరణ శుద్ధి అక్కరలేదని
టీకాతాత్పర్యాలు చెపుతున్నది—

మన జాతి పక్షి నెమలి కదా
మన జాతిసుమం పద్మం కదా
మరి మన జాతి గుణం ఏమిటంటే
"మోసం" అని చెప్పుకుంటే
ముచ్చటగా ఉంటుందేమో !
మన జాతి రంగు ఏమిటంటే
"చీకటి" అని ఒప్పుకుంటే
చైతన్యం కలుగుతుందేమో
స్వాతంత్ర్యం వెలుగుతుందేమో !



ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నింటిని చేపట్టి ప్రతిభావంతంగా నిర్వహించటంతో పాటు 'బాపురెడ్డి బాణీ'ని కవితా శైలిలో స్థాపించుకున్న కవి డాక్టరు బాపురెడ్డి. కలం పట్టిన చిన్న నాటినుంచే కవిత్వమొక ఆత్మకళగా ఆరని అగ్నిలా బాపురెడ్డిలో వెలుగొందింది. పద్యంగానీ, వచనంగానీ, కావ్యంగానీ, రూపకంగానీ, గేయంకానీ, కీర్తనగానీ సమకాలీన జీవన స్పందనంతో మానవసౌగంధ్యాన్ని మోసుకొస్తుంది. దార్శనిక తత్త్వ గాంభీర్యాన్ని ప్రదర్శిస్తుంది. ప్రకృతిని ప్రణయంగా భావించటం, ప్రకృతిలోని పరంజ్యోతిని ప్రణవంగా ఉపాసించటం, ఆ రెంటికీ వున్న సంబంధాన్ని అన్వేషించటం, దానిని కవితగా ఆవిష్కరించటం బాపురెడ్డి గారి సాహితీ ప్రవృత్తి.

వృత్తి చేత ప్రభుత్వోద్యోగి అయినా, ప్రవృత్తి చేత కవితా హృద్యోగి. కర్తవ్య పాలనంలో దేశ విదేశాలను సందర్శించినా తన ప్రవృత్తి చేత వాటి అందచందాలను కవితా చిత్ర లహరులుగా పొంగించిన సహృదయులు డాక్టర్ బాపురెడ్డి. అందాన్ని అందుకొని అందంగా అభివ్యక్తీకరించటమే ఆశ్చర్యమైన విషయం లోకంలో రెడ్డిగారు అందాన్నే కాక అందులోని అందని తత్త్వాన్ని కూడా అన్వేషించి ఆవిష్కరించే దాకా తృప్తి పడరు. వాస్తవ జీవితంలోని తాత్త్విక దర్శనం బాపురెడ్డిగారి కవిత.

ఈ "రంగు రంగుల చీకట్లు" రెడ్డిగారి సృజనాత్మక ప్రయోజనాత్మక కవితా ప్రస్థానంలో మరొక మైలు రాయి. వీరి మూడు ఆంగ్ల కవితా సంపుటాలు వీరికి అంతర్జాతీయ కీర్తిని ఆర్జించిపెట్టినవి. వీరి 'శ్రీకార శిఖరం' హిందిలోకి అనువదించబడింది.

1936 కరీంనగర్ జిల్లా సిరికొండలో పుట్టి, ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఎం.ఎ. ఎకనామిక్స్ పట్టం గైకొని, సేవాతత్పరుడైన ఐ.ఎ.ఎస్., ఆఫీసరుగా వివిధ హోదాలలో ప్రజా ప్రభుత్వ రంగాల్లో పని చేస్తున్నారు. 1971లో వీరి కవితకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. 1989లో ప్రపంచకవుల మహాసభల్లో వీరికి ప్రపంచ కళా సంస్కృతుల అకాడమీ నుండి గౌరవ డాక్టరేట్ బిరుదు లభించింది. 1987లో మైఖేల్ మధుసూదన్ అవార్డు, 1988లో 'ఆనరరీ డాక్టర్ ఇన్ హ్యూమానిటీస్' బిరుదు లభించాయి. 1989 ఉత్తమ వచన కవితకు తెలుగు విశ్వవిద్యాలయం వారు ఇచ్చిన బహుమతి వీరి 'మన చేతుల్లోనే ఉంది' అన్న కవితా సంపుటికి లభించింది. ఇంట గెలిచి రచ్చ గెలిచిన దక్షులు డాక్టరు బాపురెడ్డిగారు.



ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నింటిని చేపట్టి ప్రతిభావంతంగా నిర్వహించటంతో పాటు 'బాపురెడ్డి బాణీ'ని కవితా శైలిలో స్థాపించుకున్న కవి డాక్టరు బాపురెడ్డి. కలం పట్టిన చిన్ననాటినుంచే కవిత్వమొక ఆత్మకళగా ఆరని అగ్నిలా బాపురెడ్డిలో వెలుగొందింది. పద్యంగానీ, వచనంగానీ, కావ్యంగానీ, రూపకంగానీ, గేయంకానీ, కీర్తనగానీ సమకాలీన జీవన స్పందనంతో మానవసౌగంధ్యాన్ని మోసుకొస్తుంది. దార్శనిక తత్త్వ గాంభీర్యాన్ని ప్రదర్శిస్తుంది. ప్రకృతిని ప్రణయంగా భావించటం, ప్రకృతిలోని పరంజ్యోతిని ప్రణవంగా ఉపాసించటం, ఆ రెంటికీ వున్న సంబంధాన్ని అన్వేషించటం, దానిని కవితగా ఆవిష్కరించటం బాపురెడ్డి గారి సాహితీ ప్రవృత్తి.

వృత్తి చేత ప్రభుత్వోద్యోగి అయినా, ప్రవృత్తి చేత కవితా హృద్యోగి. కర్తవ్య పాలనంలో దేశ విదేశాలను సందర్శించినా తన ప్రవృత్తి చేత వాటి అందచందాలను కవితా చిత్ర లహరులుగా పొంగించిన సహృదయులు డాక్టర్ బాపురెడ్డి. అందాన్ని అందుకొని అందంగా అభివ్యక్తీకరించటమే ఆశ్చర్యమైన విషయం లోకంలో రెడ్డిగారు అందాన్నే కాక అందులోని అందని తత్త్వాన్ని కూడా అన్వేషించి ఆవిష్కరించే దాకా తృప్తి పడరు. వాస్తవ జీవితంలోని తాత్త్విక దర్శనం బాపురెడ్డిగారి కవిత.

ఈ "రంగు రంగుల చీకట్లు" రెడ్డిగారి సృజనాత్మక ప్రయోజనాత్మక కవితా ప్రస్థానంలో మరొక మైలు రాయి. వీరి మూడు ఆంగ్ల కవితా సంపుటాలు వీరికి అంతర్జాతీయ కీర్తిని ఆర్జించిపెట్టినవి. వీరి 'శ్రీకార శిఖరం' హిందిలోకి అనువదించబడింది.

1936 కరీంనగర్ జిల్లా సిరికొండలో పుట్టి, ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఎం.ఎ. ఎకనామిక్స్ పట్టం గైకొని, సేవాతత్పరుడైన ఐ.ఎ.ఎస్., ఆఫీసరుగా వివిధ హోదాలలో ప్రజా ప్రభుత్వ రంగాల్లో పని చేస్తున్నారు. 1971లో వీరి కవితకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. 1989లో ప్రపంచకవుల మహాసభల్లో వీరికి ప్రపంచ కళా సంస్కృతుల అకాడమీ నుండి గౌరవ డాక్టరేట్ బిరుదు లభించింది. 1987లో మైఖేల్ మధుసూదన్ అవార్డు, 1988లో 'ఆనరరీ డాక్టర్ ఇన్ హ్యూమానిటీస్' బిరుదు లభించాయి. 1989 ఉత్తమ వచన కవితకు తెలుగు విశ్వవిద్యాలయం వారు ఇచ్చిన బహుమతి వీరి 'మన చేతుల్లోనే ఉంది' అన్న కవితా సంపుటికి లభించింది. ఇంట గెలిచి రచ్చ గెలిచిన దక్షులు డాక్టరు బాపురెడ్డిగారు.